# ధర్మోపదేశము.

భారత భాగవత రామాయణములనుండి,

చిత్రపు వేంకట నరసింహారావుచే

కూర్చి వ్రాయఁబడిన గద్యపద్యాత్మకములగు నీతికథలు.



ప్ర థ మ భా గ ము

మొదటికూర్పు.

రాజమహేంద్రవరమున

శ్రీ మనోరమా ముద్రాక్షరశాలయందు,

ముద్రింపించి ప్రకటింపఁబడెను.

1919.

 [వెల రు. 1—0—0

4/41

# FOREWORD.

I have carefully read through the book of select moral tales from the famous sacred books, Bharata, Bhagavata and Ramayana, published by M. R. Ry. Ch. V. Narasimha Row under the name of "Dharmopadesam".

It contains many stories designed to inculcate piety, loyalty, self sacrifice and other virtues, which are essential for the upbuilding of a stainless life. Each story has been prefaced with a foreword setting forth in simple prose the context, the substance and the moral which it conveys, with a view to enable the student easily to understand the poem. There can be no doubt that the above method is calculated to encourage the student to read the poem for himself, to gather its purport and to derive pleasure thereby. Moreover, the lives of the authors are also briefly set out.

I am of opinion that this book can be prescribed as a text book for the IVth, Vth or VIth Forms, containing as it does, excellent samples of the poetry of the standard authors.

*Rajahmundry,*
*10—8—1919*

(Sd). V. SUBBARAYUDU,
*Telugu pandit in the Arts College,*
RAJAHMUNDRY.

# ఉపోద్ఘాతము.

—:o:—

సుప్రసిద్ధపవిత్రగ్రంథము లయినభారతభాగవతరామాయణము లలోని నీతిబోధకము లయినకథపట్టులనుండి యెత్తి వేఱుగా ముద్రింపించి తాము ప్రకటించినధర్మోపదేశ మనుగ్రంథము మ॥రా॥శ్రీ చిత్రపు వేంకటనరసింహారావుగారు నా కందఁజేయఁగా దానిని సావధానముగ సాంతముగఁ జదివితిని.

ఇందు దైవభక్తి, రాజభక్తి, స్వార్థత్యాగము మొదలుగా మానవులు నిష్కళంక మైనదేహయాత్ర చేయుటకు నావశ్యకము లగువిషయములు పెక్కులు చేర్పఁబడి యున్నవి. పైగ్రంథములయందలి యాయాఘట్టములనుండి యెత్తి కూర్చినపద్యములలోనియంశముల సులభముగా విద్యార్థులు గ్రహించుటకై తత్తత్కథాసందర్భములును, పద్యభావములును సంగ్రహముగా నాయావిషయములకు మొదట వచనరూపముగా వ్రాసి యందలిసారాంశములతోఁ గూడ నీపుస్తకమునఁ దెలిపి యున్నారు. ఈమార్గము విద్యార్థులు పద్యములు చదివి భావము దెలిసికొని యానందించుటకుఁ బ్రోత్సాహకరముగా నుండు నని చెప్పుటకు సందేహ మేమియు లేదు. మఱియు నీపాత్రమునఁ జేర్పఁబడిన విషయములు రచియించినకవులచరిత్రములుఁ గూడ కొంతవఱకు సంగ్రహముగా నిందుఁ గానవచ్చుచున్నవి. మహాకవులకవిత్వమాధుర్యమును జవిచూపఁగలయీగ్రంథము పాఠశాలలలోని 4, 5, 6 ఫారములలో దేనికయినను బఠనీయముగా నేర్పఱుపఁబడుట కర్హముగా నుండు నని నాయభిప్రాయము.

10—8—19.
రాజమహేంద్రపురము.

వడ్డాది సుబ్బారాయఁడు,
రాజమహేంద్రవరరాజకీయకళాశాలాంధ్ర
పండితుఁడు.

# విజ్ఞాపనము.

———:(o):———

ఈగ్రంథ మున్నతపాఠశాలావిద్యార్థులకుఁ బఠనీయగ్రంథముగా నుండఁ దగినట్లు ప్రయత్నించి కూర్పఁబడినది. భారతభాగవతరామాయణాదిపురాణగ్రంథములనుండిమాత్రమే యిందలి నీతిబోధకములైనకథలు గ్రహింపఁబడినవి. ఈపుస్తకపఠనమువలన దైవభక్తియు, రాజభక్తియు గలిగి, పెద్దలయెడను, తోడిబాలురయెడలను, తలిదండ్రులయెడలను, భ్రాతృవర్గము నెడలను, బంధుమిత్రాదులయెడలను, విశేషించి నిరుపేదలైనసన్నిహితులయెడలను, యెట్లు నడుచుకొనవలయునో బాలురు గ్రహింపగలుగుదురని నా యాశయము. దీనిని మ॥ రా॥ శ్రీ శ్రీమాన్ ముడుంబి లక్ష్మీనృసింహ జగన్నాథాచార్యులుగారు నాతో నేను మనవిచేసినరీతిని వ్రాసినారు దయచేసి. వారిసహాయమే లేకయుండినచో నే నీగ్రంథమును పదునైదుదినముల కాలములోపల వ్రాయించి యచ్చుపని పూర్తి చేయలేకపోయియుందు ననుటకు సందేహము లేదు. నేకోరినరీతిని రామాయణకథలో బాలుర కత్యవసరమయిన భాగములన్నియు నిందుఁ బొందుపఱిచిరి. ఒక్క రామాయణములోనిభాగములను మాత్రము గ్రహించి వ్రాయుటకే నాకుఁ జాలకాలము పట్టియుండును. భారతభాగవతములయందలి విషయములుకూడ నేరుటలో నేను వారితో మనవిచేసిన నియమముల ననుసరించి నీతిబోధకములగు కథలనేరి పొందుపఱిచి మఱియు, పాఠకులకు సుబోధకమగునట్లు కథాసందర్భములను కథాంశములను అందలి నీతులను నేను కోరినరీతిని వ్రాయించి వారు దయచేసిరి. వీ రెండనక వేళనక పాళనక యీపదునైదుదినములు మాముద్రాక్షరశాలకువచ్చి యీగ్రంథము నింతస్వల్పకాలములోఁ బూర్తియగుటకు నా కెంతయుఁ దోడ్పడిరి. వారికి నాహృదయపూర్వకవందనములు సమర్పించుచున్నాఁడను.

బాలుర కత్యంతోపయుక్తము లగుపుస్తకములను వ్రాయనెంచి యానడుమ మేము కొన్నిపుస్తకములను బ్రకటించితిమి. ఇప్పటి కిదియే కడపటిది.

పఠనీయగ్రంథనిర్మాయకర్తలు మాకుం జేయూత నొసంగి ప్రోత్సాహపఱతురేని యిట్టికాగితములకఱవుకాలములో నైన మాయుద్యమ మనంతరకాలములోనే కొనసాగఁ గలదు.

ఇందు ముద్రింపఁబడిన పటముల బ్లాక్కులు మాకు యస్. గున్నేశ్వరరావు బ్రదర్సువారు ముద్రించుకొనుట కొసంగిరి గాన వారికి మేము కృతజ్ఞులము.

ఇట్లు,

బుధజనవిధేయుఁడు,

చిర్రావు వేంకటనరసింహారావు.

6—3—1919.

రాజమహేంద్రవరము

# విజ్ఞాపనము.

---

ఆర్యులారా !

రాజమహేంద్రవరపురవ్యాస్తవ్యు లగు మహారాజశ్రీ చిత్రపు వేంకటనరసింహారావుపంతులుగారొక శుభదినంబున తమసాన్నిధ్యంబునకు నన్ను సగౌరవంబుగ రప్పించి "ఆచార్యవర్యా! ఋషిప్రోక్తములగు, భారత, భాగవత, రామాయణములయందుగల ధర్మములు ప్రపంచకోపయోగములయి, సకలజనులకును ఉన్నతపాఠశాలావిద్యార్థులకును సదవడికలు చక్కఁజేయునవి పెక్కులుగలవు. గ్రంథములు సాంగోపాంగముగా నధ్యయనము జేసినగాని సులభముగా నలవడకయున్నవి గావున కాలోపయోగములయినధర్మము లీగ్రంథములయందుఁ జక్కఁగఁబరిశీలించి, ఏధర్మమున కాధర్మము వేఱు, వేఱుగా నీతిబోధకమగు సందర్భములు క్లుప్తపఱచి తొలుత కథారూపమును, పిదప నందుకు సంబంధించిన ఫలితార్థమును, (నీతి) కరతలామలకముగా బోధమగునటుల నేర్పఱచి, గ్రంథస్థములు గద్యపద్యాత్మకములు నయినకథల నత్యంతోపయుక్తముగాసుబోధమగునటుల నెన్నికచేసి వ్రాయవలయునని నాకాజ్ఞయొసంగ, తదనుజ్ఞానుసారము నే నామోదించి సులభశైలిని నాయభిప్రాయములతో ధర్మోపదేశ మనుపేర ప్రథమభాగముగా నీగ్రంథము వ్రాసి వారికి సమర్పించితిని. కావున మాననీయు లగుపెద్దలు ఇందలి ధర్మములను స్వీకరించి ప్రమాదవశమువలన సంభవమగు దోషములను మన్నించెదరని వినయపూర్వకముగాఁ బ్రార్థించుచున్నాఁడను. మఱియు నిట్టి ధర్మంబులను వెల్లడిచేయు పురాణాంతర్గతము లయినగాథలను, లోకోపకారార్థమయి బయల్పఱచుటకు కవివరులకుఁ బ్రోత్సాహ మొసంగి విశేష

ధనంబులచే వాని నాదరించుతలంపు గలిగి ఆంధ్రలోకంబునకు శాశ్వత
మగు నుపకార మొసంగు విద్యాభిమాను లగు శ్రీపంతులువారిని సర్వే
శ్వరుఁడు ఆయురారోగ్యైశ్వర్యాదిసంపదలతోడను, పుత్రపౌత్రాభి
వృద్ధితోడను వర్ధిల్లుటకు సర్వదా కృపఁజూచి రక్షించుఁగాక.

ఇట్లు బుధజనవిధేయుఁడు,

శ్రీమాన్ ముడుంబ లక్ష్మీనృసింహజగన్నాథాచార్యస్వామి.

10—3—19

# నన్నయభట్టు

ఇతఁడు ముద్గలగోత్రజాతుఁ డగు వైదిక బ్రాహ్మణుఁడు. వేఁగినాఁటి వాఁడు. వేదాధ్యయనసంపన్నుఁ డయి సంస్కృతాంధ్రభాషలయం దసమానపాండిత్యము గలిగి రాజరాజనరేంద్రుని యాస్థానపండితుఁడై యుండెను. ఇతఁడు క్రీ. శ. 1023 వ సంవత్సరప్రాంతము మొదలు కొని యున్నవాఁడు. రాజరాజనరేంద్రునిచే నియమింపఁబడి భారతము నాంధ్రీకరించుటకుఁ బూని ఆదిపర్వమును సభాపర్వమును అరణ్యపర్వమును దెనిఁగించిన ట్లాశ్వాసాంతగద్యములవలనఁ దెలియవచ్చుచున్నది. కాని నాల్గవ యాశ్వాసములో సహస్రప్రశ్నములకు ధర్మరాజు ప్రత్యుత్తరము లిచ్చుట యను కథపట్టున "శారదరాత్రు" లనుపద్యముచివర 'నన్నయభట్టు కవిత్వము సంపూర్ణము. ఇక్కడనుండి యఱ్ఱాప్రగడ కవిత్వము' అనియును అరణ్యపర్వము 7-వ యాశ్వాసము చివర

"సీ. భవ్యచరిత్రుఁ డాపస్తంబసూత్రుండు
 శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంసక్తధ్యానసంసక్తచిత్తుఁడు సూర
 నార్యునకును బోతమాంబికకును
నందనుం డిలఁ బాకనాటిలో నీలకం
 ఠేశ్వరస్థాన మై యెసక మెసఁగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు
 ధన్యుఁడు ధర్మైకతత్పరాత్ముఁ

తే. డెఱ్ఱనార్యుండు సకలలోకైకవిదితుఁ
డయిననన్నయభట్టమహాకవీంద్రు
సరససారస్వతాంశప్రశస్తి దన్నుఁ

జెందుటయు సాధుజనహర్ష సిద్ధిం గోరి.

క. ధీరవిచారుఁడు తత్కవి
తా కీర్తియుఁ గొంత దోఁపఁ దద్రచనయు కా
నారణ్యపర్వశేషము
పూరించెఁ గవీంద్రకర్ణపుటపేయముగాన్."

అనియును భారతగ్రంథములందుఁ గానఁబడు చుండుటచేత నిందలి తత్త్వము పండితు లింకను విమర్శించి నిగ్గు దేల్పవలసినదిగాఁ దోఁచు చున్నది. ఈభారతరచనయం దీతఁడు తనకు నారాయణభట్టనువిద్వాంసుఁడు సహాయముగాఁ నుండె నని వ్రాసికొన్నాఁడు. ఇతనిది మృదువైన సులభశైలి. కవిత్వము ద్రాక్షాపాకమును మిక్కిలి రసవంతమునైనదై రెండువంతులు సంస్కృతపదములు నొకవంతు తెలుఁగుపదములు గలిగియుండును. ఇతఁ డాంధ్రశబ్దచింతామణి యనులాక్షణిక గ్రంథము నొకదానినిగూడ చేసె నని చెప్పుదురుగాని దానిసత్యమింకను విచారణీయము. కాని, యితనికి వాగనుశాసనుఁ డనుబిరుదువచ్చి యుండుటచే నీతఁ డాగ్రంథమును రచించెననియె కొంద ఱూహింతురు. ఈతఁడు తన కాలమును రాజమహేంద్రవరముననే గడపి యిక్కడనే మహాభారతము నాంధ్రీకరింప మొదలుపెట్టి యాంధ్రలోకమునకువన్నె దెచ్చెను.

---

## తిక్కన సోమయాజి.

---

ఇతఁడు మంత్రిభాస్కరునిమనుమఁడు. గుంటూరునకు దండనాథుఁడుగా నుండినకొమ్మనామాత్యునిపుత్రుఁడు. ఆపస్తంభసూత్రుఁడు. గౌతమగోత్రుఁడు. నన్నయభట్టారకున కించుమించుగా రెండువందల సంవత్సరములతరువాత ననఁగా క్రీ. శ. 1200-1257 సంవత్సరముల

మధ్యమున నుండినవాఁడు. మనుమసిద్ధిరాజుకడ మంత్రియు గవియు నై విఖ్యాతిఁ గాంచెను. ఇతఁడు తొలుత నిర్వచనోత్తరరామాయణమును రచియించెను. అప్పటికి యజ్ఞము చేసియుండలేదు. యజ్ఞము చేసినపిదప భారతము నాంధ్రీకరింపఁబూని విరాటపర్వము మొదలుకొని కడవఱకును రచియించెను. తిక్కనకవిత్వము ద్రాక్షాపాకమై మిక్కిలి రసవంతముగా నుండును. ఈతనికవిత్వమునందు వ్యర్థపదములు గానరావు. ఈతనికవిత్వముతో సమానముగాఁగాని దానిని మించునట్లుగాని కవిత్వము చెప్పఁగలిగినవారు నేఁటివఱకు నొక్కరును గనంబడరు. లోకోక్తులతోఁ గూడి జాతీయముగా నుండుపదలాలిత్యము యుక్తిబాహుళ్యము అర్థగౌరవము రచనాచమత్కృతి శయ్యావిశేషము కల్పనాకౌశలము నన్యులకు రావు. కావుననే యీతనిని కవిబ్రహ్మ యని కవీశ్వరు లందఱును వాకొనుచుండిరి.

## ఎఱ్ఱాప్రగడ

ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు. ఇంటిపేరు చెదలవాడవారు. నెల్లూరిమండలములోనికందుకూరితాలూకాలోనిగుడ్లూరు నివాసస్థలము. తండ్రి సూరన్న. తల్లిపోతమ్మ. శ్రీవత్సగోత్రుఁడు. ఇతఁడు తిక్కనసోమయాజికి రమారమి నేఁబది సంవత్సరములతరువాత నుండినవాఁడు. ఈతనికాలమువఱకు నన్నయభట్టు విడిచిన యారణ్యపర్వశేషము తెనిఁగింపఁబడక భారతము కొఱఁతపడియుండుటఁ జూచి యితఁడు దానిని తెనిఁగింపనెంచియు తనపేరిటనాంధ్రీకరించినచో నన్నయభట్టారకునకుఁ బోలెఁ దనకు నేదోకీడు మూఁడు నని భయపడి రాజరాజనరేంద్రున కంకితముగా నన్నయభట్టుపేరుతోనే రచియించెనని చరిత్రకారులు వ్రాసియున్నారు. నన్నయభట్టు మూఁడుపర్వములు ముగించినట్లు

తిక్కన సోమయాజి విరాటపర్వాదియందు వ్రాసి యుండుటచేత చరిత్ర కారులు వ్రాసిన విషయ మింకను విమర్శింపవలసినది గా నున్నది. ఈతని శైలి మృదుమధుర మై కదళీపాకముగా తిక్కనకవిత్వమును బోలి యుండును. సంస్కృతపదములను తెలుగుపదములను సమానముగా వాడినవాడు. ఈతడు చేసిన యితరగ్రంథములు రామాయణము, హరి వంశము, లక్ష్మీనృసింహపురాణము.

---

## బమ్మెర పోతరాజు

---

ఈకవి యారువేలనియోగి. క్రీ. శ. 1400వ సంవత్సరప్రాంతమున జన్మించెను. శ్రీరామభద్రుడు స్వప్నంబులో బొడసూపి తన కంకితముగా భాగవతము నాంధ్రీకరింపు మని నియమించుటచేత తా నీగ్రంథమును తెనిగించినట్లు పోతన్నయే వ్రాసికొన్నాడు. యితని విరచిత మైన భాగవతము విశేషభాగము నశింపగా గంగరాజు పంచమస్కంధమును షష్ఠస్కంధము నేర్చూరిసింగనయు ఏకాదశద్వాదశస్కంధములను వెలిగందల నారయయు పూరించిరి. పోతన ధనికుడు గాకయు రాజుల నాశ్రయింపకయే కృషికర్మచే గాలము గడపుకొనెను. ఇతనికవిత్వము భక్తిరసప్రధాన మయినది. పదలాలిత్యము గల దై యమకాదిశబ్దాలం కారభూయిష్ఠ మై శ్రావ్యముగా నుండును. భగవద్గుణవర్ణనాదులు వచ్చి నపుడు తనభక్తి తేటపడునట్లు స్వకపోలకల్పితవర్ణనలుం గూర్చియు విష్ణుపురాణాదులలో నిమఱికొన్ని కథలను జేర్చియు గ్రంథమును బెంచి వ్రాసెను. భాగవతములో శివదూషణమును విశేషముగా జేసియుండుట చేతం దత్పాపపరిహారార్థమయి యితడు వీరభద్రవిజయ మనుగ్రంథ మును రచియించె నని కొందఱు చెప్పుదురుగాని యది వివాదాస్పదము. ఇతడు దాదాపు డెబ్బదియైదుసంవత్సరములు జీవించెను. ఇతనికి శ్రీనాథ

కవి బావమఱఁది. ఇరువురు నేకకాలమువారే. పోతన శ్రీనాథునికంటెను నిరువదిముప్పదేండ్లు చిన్నవాఁడు.

---

## భాస్కరుఁడు.

— :o: —

ఈతఁ డాఱువేలనియోగి. ఆపస్తంభసూత్రుఁడు. హరితసగోత్రుఁడు. కొండవీ డీతని కునికిపట్టు. ఈతఁడు రాజాస్థానముల మిక్కిలి గౌరవమందినసుప్రసిద్ధమహాకవి. క్రీ.శ. 1330 వ సంవత్సరప్రాంతమున రామాయణము తెలిఁగించి సకలాంధ్రలోకోపకృతిఁ గావించెను. ఈతని వలననే దీనికి భాస్కరరామాయణ మన్నపేరు వచ్చినది. ఈతఁ డీరామాయణములో నారణ్యకాండమును యుద్ధకాండములోఁ గొంతభాగమును మాత్రము రచియించి నిక్కినభాగములో బాలకిష్కింధాసుందరకాండములను దనపుత్త్రుఁ డగుమల్లికార్జునభట్టుచేతను, అయోధ్యాకాండమును దనశిష్యుఁ డగుకుమారరుద్రదేవునిచేతను నాంధ్రీకరింపించెను. యుద్ధకాండములోని తుదిభాగము భాస్కరునిమిత్త్రుఁ డగు నయ్యలార్యుఁడు రచించెను. శీఘ్రముగా సాంతముచేయవలె నని కోరుటచేత నిట్లు తనకుమారుఁడు మొదలగువారిచేత వ్రాయించెనని ప్రతీతి. ఈరామాయణము సాహిణిమారని కంకితముచేయఁబడినది. సాహిణిమారఁడు గుఱ్ఱపువాఁ డని చెప్పెడికథ కేవలము కల్పితము. సాహిణిమారఁడు బుద్ధరాజకుమారుఁడు. రెడ్డివంశపురాజు. ఇతఁడు ద్వితీయప్రతాపరుద్రుని కాలములో నాతనియశ్వసేనాధ్యక్షుఁడుగానుండి తద్రాజ్యము తురుష్కాక్రాంత మైనయనంతరము స్వతంత్రుఁ డయి యొకదేశపాలకుఁ డయ్యెను. పయిని నుడివినకుమారరుద్రదేవుఁ డితని కుమారుండే.

---

# విషయసూచిక.


| నెం. | పే. | విషయము |
|---|---|---|
| 1. | 1 | దైవప్రార్థన. |
| 2. | 1—6 | రాష్ట్రజనుల కర్తవ్యధర్మములు. |
| 3. | 6—8 | ఉత్తరాగర్భ సంరక్షణము. |
| 4. | 8--12 | పరీక్షిన్మహారాజుశాపము. |
| 5. | 13--15 | శమీకునిహితవచనములు. |
| 6. | 15--18 | రంతిదేవుడు. |
| 7. | 18--34 | కుచేలోపాఖ్యానము. |
| 8. | 34--46 | భీష్ముడు—స్వార్థత్యాగప్రతిజ్ఞ. |
| 9. | 46--49 | ద్రోణుడు శస్త్రవిద్యం దనశిష్యుల బరీక్షించుట. |
| 10. | 49--59 | ధర్మవ్యాధుడు. |
| 11. | 59--72 | ప్రహ్లాదచరిత్ర. |
| 12. | 72--77 | హంసకాకీయోపాఖ్యానము. |
| 13. | 78--84 | శరణాగతరక్షణసూక్తము. |
| 14. | 85--93 | నాడీజంఘునిచరిత్రము. |
| 15. | 93--95 | భీష్ముడు శ్రీకృష్ణునిస్తుతించుట. |
| 16. | 95-129 | పితృవాక్యపరిపాలనము. |
| 17. | 130-134 | శ్రీరామపట్టాభిషేకము. |
| 18. | 135 | రాజభక్తి. |

# ధర్మోపదేశము.



## దైవప్రార్థన.

ఉ. శ్రీయన గౌరి నాఁ బరఁగు చెల్వలచిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తులై హరిహరంబగురూపముఁ దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడుభక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చు మెచ్చుపరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్. (తిక్కన)

గీ. నీవు నిట్టూర్పుగాడ్పులు నిగమపంక్తి
ప్రణవమంత్రాక్షరము నీకు భద్రపీఠి
విలయకాలంబు నీనిద్ర విశ్వమునకు
నీప్రబోధంబ యుదయంబు నిఖిలమునకు. (హరవిలాసము.)

గీ. కలమి లే దను రెండుపక్షములనడుమఁ
జెంది సర్వంబుఁ జూడఁగాఁ జేయుచున్న
యట్టి నిత్యస్వరూపంబు నాత్మయందు
నిలిపి సద్భక్తి సతతంబుఁ దలఁతు నేను. (వాసిష్ఠరామాయణము)

క. ఆకారము గల దనియు ని
రాకారం బనియు శూన్య మనుజసమ్మతముల్
పోఁకక సంవిద్రూపు ని
రాకారము నైన పరాత్ము ననుసంధింతున్.

---

## రాష్ట్రజనులు కర్హధర్మములు.

---

### కథాసందర్భము.

కౌరవపాండవయుద్ధానంతరమున శరతల్పగతుండును గురువృద్ధుండును నగు భీష్మునొద్దకు ధర్మతనయుం డేతెంచి రాజధర్మాదినీతుల ననుగ్రహించి చెప్పవలయు నని వేడిన భీష్ముండు రాష్ట్రజనుల కర్హంబు లగుధర్మంబులు కొన్నిటిని దెలిపెను.

వడిన విష్ణుఁడై బ్రహ్మ గానఁగఁ బోయి
మాకు రక్షకుఁడుగ మహీపుఁ జేకొను

తే. వలయు రూపింపు మాతనిఁ గొలిచి బ్రతుకు
వార మనుటయు నజుఁడును వారివలని
కరుణ మనువు నిరూపించె నరు లనశ్వ
చరితు లని పాలనమునకుఁ జొరఁడె యతఁడు.

వ. వారి కున్న సజ్జనంబు లమ్మహాత్మునితో నీకుం బుయిపోడ నేల ప్రజలచేతఁ బశువులయందును బసిండిని నేఁబది యగునంశంబును ధాన్యంబున దశమభాగంబును భండారంబుగాఁ బుచ్చుకొని శస్త్రోప జీవుల నెల్ల నీవారిం జేసికొని బలవంతుండవై దుష్టనిగ్రహశిష్టప్రతి పాలనం బాచరింపు మే మందఱము ననుసరించి నీపనువు సేయంగల వార మధర్మవర్తనులు నీచేతం జెడువారు ధర్మవర్తనులు సేసిన ధర్మంబున నాఱవపాలు నిన్నుం జేరం గలయదిగా నొడంబడితి మిం ద్రుండు దేవతల రక్షించుచున్నాఁడు మమ్ము రక్షించుకొని సుఖం బుండు మనుటయు.

క. అతఁ డొడఁబడి యత్తఱిఁగున
నతిబలవంతుఁ డయి నీతి నంచిత మగుచు
ద్ధతవిక్రమముఁ దగి నీ
క్షితిఁ బాలించె సుఖులై రశేషజనములున్.

చ. కావున మేలు సేయుదె జగజ్జనకోటికి రాజునాజ్ఞమైఁ
బోవుట మానినిం దగినప్రాజలఁ దృప్తినిఁ జేత దేవసం
భావనఁ గొల్వతం డొకటఁ బాడి దొఱంగిన నైచు నెట్లు సం
భావితుఁ జేయఁగా ననిపం బొసరింతురు మ్రొక్కి శత్రులున్.

క. తనవారు పెద్ద సేయని
మనుజేశు నరాతిజనులు మదిని సరకుఁగాఁ

గాన రవి భూప్రజ కొప్పదు
విను కాన్పునఁ బతికిఁ బ్రజలు వెఱచుట యొప్పున్.

తే. వాహనాసనశయ్యానివాసములును
భోజ్యగంధమాల్యాంబరభూషణములు
గుప్తియును నరపతికి నెక్కుడుగ వలయు
ననుతలంపుతో మనుట భూజనులగుణము.

చ. అతఁడును మందహాసనహితాలపనంబును సత్యభాషణ
వ్రతమును సంవిభాగనిరవద్యతయుఁ సమభావముం గృత
జ్ఞతయు జితేంద్రియత్వముఁ బ్రసాదఫలంబును గల్గి భూమికిం
బిత్రుసముఁ డై విరోధిజనభీషణసారత నొప్పెఁ జెం.పగున్.

వ. అనుటయుం గౌంతేయాగ్రజుండు మనుష్యుల కెల్ల రాజనిపతియును
దైవంబునుం గా విప్రులు సెప్పి రట్లగుట యేమిటనో యని యుండుదు
నది మావలసం బ్రస్ఫుటంబుగా వింటి నని పలికిన గాంగేయుం
డింకనుం జెప్పెదఁ దొల్లి వసుమనుం డనుమానవేంద్రుఁడు నీవపోలె
వితర్కించి బృహస్పతి నడిగిన నతం డతనికిఁ జెప్పినభంగి నాకర్ణింపు మని యిట్లనియె.

తే. లోకములు లోకధర్మంబులును నృపాల
రాజమూలముల్ రాజవిరహిత మైన
పుడమిజనులకు నింకినమడువులోని
జలచరంబులు పడుపాటు సంభవిల్లు.

క. తరణిశశాంకులతేజ
స్స్ఫురణము లేకున్నయట్ల భూజనములు ని
ర్భరదురితతఁ జేడ్పడుదురు
నరపాలకవిహీనపాలనము లేకున్నన్.

క. తనధన మిది యని యూఱడి
మనఁ బరిణయ శ్రీమాదిక్రమైన మహోత్సవముల్
గొని యాడ నెవ్వరికి వ
చ్చునె జనపాలుండు లేనిచో నిర్భయతన్.

గీ. విభుఁడు లేకున్న జనములు సభయహృదయు
లగుచు హాహానినాదంబు లడరఁ దల్ల
డిల్లుదురు రాజు లేమియ యెల్లవారు
లేమి కల్మియ కల్మి దుర్లేపరహిత.

క. యాగములును భోగములును
త్యాగములును బహువిధములధర్మములు మహా
భాగా నరపతిరక్షా
యోగంబునఁ జెల్లుఁ బ్రజకు నుల్లాసముగన్.

క. ఒకరునికి నలిగి యాతని
సకలహిరణ్యంబు రత్నసంచయమును బు
చ్చుకొనుం దనవలచినవా
నికి నిచ్చు ధనేశుఁ డింద్రుఁ నృపు నట్టేతటిన్.

తే. చారచక్షుఁడై కను నెల్లజగము నపుడు
సూర్యుఁ డింద్రు నరేంద్రు నకార్యకరులఁ
దునుము నప్పుడ జముఁడు నాఁ జను నతండు
దేవతాత్మకుఁ డగుట సందియమె యధిప.

క. విను నృప సమాప్తిట్టు విరా
ట్టనియెడుశబ్దములఁ బొగడు నాగమములు నె
ట్టన భూపాలకు నవిన న
తనిఁ దగ నర్చింపకుండఁ దగునె యొరులకున్.

క. నియతిమెయి నెవ్వఁ డింద్రియ
జయమును భక్తియును జిత్తసారము దృఢసం
శ్రయతయుఁ గలిగి గొలుచు నృపు
నయసంపన్నుఁడుగఁ జేయు నధిపతి యతనిన్.

క. రాజునకుఁ బ్రజశరీరము
రాజు ప్రజకు నాత్మ గాన రాజుం బ్రజయున్
రాజోత్తమ యన్యోన్యవి
రాజితులై యుండ వలయు రక్షార్చనలన్.

(శాంతిపర్వము.)

---

## ఉత్తరాగర్భసంరక్షణము.

కథాసందర్భము.

మహాభారతయుద్ధావసానమున గురుపుత్త్రుం డగునశ్వత్థామ లోకమంతయు నపాండవం బగు్యెడు మని యొక్క దివ్యాస్త్రము బ్రయోగించెను. ఆదివ్యాస్త్ర ప్రయోగమున నభిమన్యునిభార్యయు గర్భవతియు నగునుత్తర భయపడి ద్వారకానగరంబున కేగనున్న శ్రీకృష్ణునియొద్దకు వచ్చి తన భయకారణంబంతయు నామహాత్మునకు దెలిపెను. ఆమొర యంతయు విని నందనందనుండు ద్రోణనందనుండు ప్రయోగించిన దివ్యాస్త్రంబు వైష్ణవతేజంబున నిరర్థకమగునట్లుచేసి యుత్తరాగర్భస్థుఁ డైన పరీక్షిన్మహారాజును గాపాడెను.

వ. వాసుదేవుండు వ్యాసప్రముఖభూసురపూజితుం డయి యుద్ధవసాత్యకులు గొలువ ద్వారకాగమనప్రయత్నంబునఁ బాండవుల వీడ్కొని రథారోహణంబు సేయుసమయంబునం దత్తఱపడుచు నుత్తర నను దెంచి కల్యాణగుణాత్మకుం డైనహరి కిట్లనియె.

మ. ఇదె కాలానలతుల్య మైనవిశిఖం బేతెంచె దేవేశ నే
డుదరాంతర్గతగర్భదాహమున కై యుగ్రప్రభ న్వచ్చుచు

## ఉత్తరాగర్భసంరక్షణము.

న్నది దుర్లోక్యము మానుప స్మరణ మస్యం బేమియు న్లేదు నీ
పదపద్మంబులె కాని యొండు దెలియఁగ నీబాణాగ్ని వారింపవే.

క. దుర్భరబాణానలమున
గర్భములో నున్న శిశువు ఘనసంతాపా
విర్భావంబును బొందెడి
నిర్భరకృపఁ గావుమయ్య నిఖిలస్తుత్యా.

క. చెల్లెలికోడల నీమే
నల్లుడు శత్రువులచేత హతుఁ డయ్యెను సం
ఫుల్లారవిందలోచన
భల్లాగ్ని నడంచి శిశువుఁ బ్రతికింపఁ గదే.

ఆ. గర్భమందుఁ గమలగర్భాండశతములు
నిముడుకొని నటింతు నీశ్వరేశ
నీకు నొక్కమానినీగర్భరక్షణ
మెంతబరువు నిర్వహింతు గాక.

వ. అనిన నాశ్రితవత్సలుం డగు పరమేశ్వరుండు సుభద్రకోడలి దీనాలాపంబు లాలించి యిది ద్రోణనందనుండు లోకమంతయు నపాండవం బయ్యెడు మని యేసిన దివ్యాస్త్రం బని యెఱింగె. అంతఁ బాండవుల కభిముఖం బయి ద్రోణనందనుదివ్యాస్త్రనిర్గతనిశితమార్గణంబులు డగ్గఱిన బెగ్గడిలక వారును బ్రహ్మాస్త్రంబు లందుకొని పెనంగుసమయంబున.

మ. తన సేవారతిచింత గాని పరచింతాలేశము న్లేని స
జ్జనుల న్బాంధవతనూజుల న్మనుపువాత్సల్యంబుతో ద్రోణనం
దను బ్రహ్మాస్త్రము నడ్డపెట్టఁ బనిచెన్ దైత్యారి సర్వార్థసా
ధననిర్వక్రము రక్షితాఖిలసుధాంధశ్చక్రముం జక్రమున్.

మ. సకలప్రాణిహృదంతరాళముల భాస్వజ్జ్యోతియై యుండు సూ
క్ష్మకళుం డవ్యయుఁ డయ్యెడ న్విరటజాగర్భంబుఁ దాఁ జక్రహ
స్తకుఁడై వైష్ణవమాయఁ గప్పి కురుసంతానార్థియై యడ్డమై
ప్రకటస్ఫూర్తి నడంచె ద్రోణితనయబ్రహ్మాస్త్రమున్ లీలతోన్.

వ. ఇట్లు ద్రోణితనయుఁడు చేసినప్రతిక్రియారహితం బయినబ్రహ్మశిరం బనియెడిదివ్యాస్త్రంబు వైష్ణవతేజంబున నిరర్థకం బయ్యె. నిజమాయచే సకలలోకసర్గస్థితిసంహారంబు లాచరించునట్టిహరికి ధరణీసురబాణనివారణంబు విచిత్రంబు గాదు

(భాగవతము.)

---

## పరీక్షిన్మహారాజశాపము.

——:O:——

### కథాసందర్భము

పరీక్షిన్మహారాజు విష్ణుని సాహాయ్యముచే గర్భంబు వెలువడి కలియుగము నందుఁ గలిని జయించి సుఖవృత్తిచేఁ గొన్ని హాయనంబులు రాజ్యంబు సలిపి, పిమ్మట నరణ్యంబునకు వేఁటకుఁ జని కాలము సమీపింప విపరీతబుద్ధిచే శమీకునియాశ్రమంబునకుం బోయి యతనిగళంబున మృతమైనదండశూకకళేబరంబు చుట్టిన మహాముని సమాధినిష్ఠుఁడై యుండుటచే పరిజ్ఞానము లేక యున్నంత తన్మునికుమారుం డగు శృంగి సహచరులవలన జరిగిన వృత్తాంతంబు విని దందశూకకళేబరంబు మజ్జనకుని కంఠంబునఁ జుట్టినదుర్బుద్ధి నేఁటి కేడవదినంబున తక్షకవిషానలజ్వాలలచే మృతుం డగుఁగాత మని శపించి యనంతరము తండ్రికడకుఁ జని యాఘోరకృత్యంబు గని భీతచిత్తుఁడై మెడనున్నపాము మరలజీవించి తండ్రికి హానిం జేయునని దిగు లొంది భయంకరముగ నేకలువైచుచు విలపింప నంతలో సమాధియుండి తండ్రి చే లాఁకించి కుమారునివలన వర్తమానంతయు నెఱింగి జ్ఞానదృష్టిచే నతనిఁ బరీక్షిన్మహారాజుగాఁ దెలిసి తనయునిఁ జూచి యిట్లనియె “అయ్యోఁ దండ్రీ! విప్రశాపం బమోఘంబు. ఏలతామసంబుచే నిట్లు చేసితివి. సాత్వికావరోధ ముగుతామసంబుచే నిట్లాచరించుట మనకు కర్జమగునా” యని పెక్కుతెఱంగుల మందలించి రాజులేనియెడ నరాజకమై ప్రజలకు సుఖంబుచేకూరక యిక్కట్టులు సంభవించును గదా యని తన

యుని గోపించి వేగముగా నీ యుదంతమంతయు నమ్మహారాజునకుఁ దెలియఁ బని చెను. పిమ్మట పరీక్షిన్మహారాజు శాపవిధిచొప్పునఁ దా నాచరించిన కర్మము పరిపాకమై శాపమూలమై యేతత్ప్రకార మేడవనాఁడు మృతుఁడయ్యెను.

నీతి—కావున నిరపరాధు లగుసజ్జనులయెడ నకారణకల్పితములయిన దోషములుగాని బాధలుగాని చేయువారు ధర్మదేవతయాగ్రహమునకు లోనై పరీక్షిన్మహారాజువలెఫలమును బొందఁగలరు. నిరపరాధులైన సజ్జనులకు మనస్సు నొచ్చునటుల నపకృతి జేయఁదగదు. ప్రజ లెట్లు రాజభక్తి గల్గి ప్రవర్తింపవలెనో శమీకమహాముని వచనంబులవలనఁ జదువరులు గ్రహింపఁ గలరు.

పరీక్షిత్తు శమీకునిపై మృతసర్పము వైచుట.

క. మృగయులు మెచ్చ నరేంద్రుఁడు
మృగరాజపరాక్రమమున మెఱసి హరించెన్
మృగధరమండలమునఁ గల
మృగ మొక్కటి దక్క సర్వమృగముల నెల్లన్.

వ. ఇట్లు నాటం బడినవేఁటతమకంబున మృగంబులవెంబడిం బడి యెగుచుచుం జరించుటం జేసి బుభుక్షాపిపాసలవలన మిగులఁ బరిశ్రాంతుండయి ధరణీకాంతుండు చల్లనినీటికొలంకుం గానక కలంకితచిత్తుండయి చనిచని యొక్కతపోవనంబు గని యందు.

సీ. మొఱఁగుట చాలించి మీలితనేత్రుఁడై
శాంతుఁడై కూర్చుండి జడత లేక
ప్రాణమనోబుద్ధిపంచేంద్రియంబుల
బహిరంగవృత్తులఁ బాఱనీక
జాగరణాదిసంస్థానత్రయము దాఁటి
పరమమై యుండెడిపదముఁ దెలిసి
బ్రహ్మభూయత్వసంప్రాప్తిఁ బవిత్రుఁడై
యతిదీర్ఘజటలు దనర్పవరింప
సలఘురురుచర్మధారియై యలరుచున్న
తపసిఁ బొడఁగని శోషితతాలుఁ డగుచు

నెండి తడిలేక కుత్తుక నెలుఁగు డింద
మందభాషల నిట్లను మనుజవిభుఁడు.

క. తోయములు దెమ్ము మాకు
తోయము వేఁటాడ వెరపు దొరకదు ఘనచే
తోయముఁ దప్పి జనించెను
తోయమువారలుఁగ లేరు మున్నిహ మనఘా.

వ. అనిభూవరుండు శమీకమహాముని సమాధినిష్ఠానిమీలితనేత్రుండును నిస్తృతబాహ్యాంతరింద్రియవృత్తిసంచారుండును హరిచింతాపరుండు నయి యుండుటం దెలియలేక.

ఉ. కన్నులు మూసి బ్రాహ్మణుఁడు గర్వముతోడుత నున్నవాఁడు చే
సన్నల నైన రమ్మనఁడు సారజలంబులు దెచ్చి పోయఁ డే
మన్నన లైనఁ జేయఁడు సమగ్రఫలంబులు వెట్టఁ డింతసం
పన్నత నొందెనే తపతపశ్చరణాగ్రహితాగ్రప్రభావముల్.

ఆ. వారిఁ గోరుచున్న వారికి శీతల
వారియిడుట యెట్టివారికైన
వారితంబుగాని వలసినధర్మంబు
వారి యిడఁడు దాహవారి గాఁడు

చ. అని మనుజేశ్వరుండు మృగయాపరిఖేదనితాంతదాహసం
జనితదురంతరోషమున సంయమి తన్నుఁ దిరస్కరించి పూ
జనములు సేయఁడంచు మృతసర్పము నొక్కటి వింటికొప్పున
న్బనివడి తెచ్చివైచె నట బ్రహ్మమునీంద్రుని యంసవేదికన్.

వ. ఇట్లు తండు ప్రత్యాహృతబాహ్యాంతరింద్రియుం డగుట నిమీలిత లోచనుండుగానోపునో యట్లుగాక గతాగతులగు శత్రుబంధులచే నేమి యని మృషాసమాధినిష్ఠుండు గానోపునో యని వితర్కించుచు వ్యథారోషదర్పంబున మునిమూఁపున గతాసు వైనసర్పంబు నిడి

మునికుమారు లంకెయుం దెలియం జూచి శమీకనందనుం డైన శృంగికడకుం జని.

క. నరగంధగజస్యందన
తురగంబుల నేలురాజు తో నూతుండై
పరఁగ న్నీజనకుని మెడ
నురగముఁ దగిలించి పోయె నోడక తండ్రీ.

వ. అని పలికిన సమానవయోరూపమునికుమారలీలాసంగి యయినశృంగి శృంగంబులతోడిమూ ర్తి ధరియించినట్లు విజృంభించి రోషసంరంభంబున నుదరిపడి బల్యన్నంబుల భుజించి పుష్టంబు లగుపరపుష్టంబులం బోలె బలిసియు ద్వారంబులం గాచికొని యుండుసారమేయంబులపగిది దాసభూతు లగుక్షత్రియాభాసు లెట్లు బ్రాహ్మణోత్తములచే స్వరక్షకులుగ నిరూపితు లైరి. అట్టివార లెట్లు తద్గృహంబుల భాండసంగతం బగునన్నంబు భుజింప నర్హు లగుదురు. తత్కృతంబు లయినద్రోహంబు లెట్లు నిజస్వామిం జెందు నని మఱియు నిట్లనియె.

ఉ. ఆఁడదు తెన్ను దూషణము లాశ్రమవాసులఁగాని నైరులం
గూడఁడు కందమూలములు గూడుగఁ దించు సమాధినిష్ఠుఁడై
వీడఁడు లోనిచూడ్కులను విష్ణునిఁ దక్కఁ బరప్రపంచముం
జూడఁడు మద్గురుండు ఫణిఁ జుట్టఁగ నేటికి రాచవానికిన్.

ఉ. హోము హిరణ్యదానములఁ బుచ్చుకొనంగ ధనంబు లేమియుం
దేము సవంచనంబులుగ దీవన లిచ్చుచు వేసరింపఁగా
రాము వనంబులన్ గృహవిరాముల మై నివసింపఁ జెల్లరే
పామును వైవఁ గాఁ దగునె బ్రహ్మమునీంద్రుభుజాగ్రశంబునన్.

క. పుడమిఁ గలజనులు పొగడఁగఁ
గునుతును గట్టుదురు గాక కువలయపతులై

యడవుల నిడుమలఁ బడియెడి
బడుగులమీఁద నిడఁగఁ దగునె పన్నగశవమున్.

క. భగవంతుఁడు గోవిందుఁడు
జగతిం బెడఁబాసి చనిన శాసింపంగాఁ
దగువారు లేమి దుర్జను
లెగసి మహాసాధుజనుల నేఁచెద రకటా.

క. బాలకులార ధరిత్రీ
పాలకు శపియింతు ననుచు బలువడిని విలో
లాలకుఁ డగుమునికుంజర
బాలకుఁ డరిగెం ద్రిలోకపాలకు లదరన్.

వ. ఇట్లు రోషించి కౌశికీనదికిం జని జలోపస్పర్శనంబు చేసి.

ఉ. ఓడక వింటికోపున మృతోరగముం గొనివచ్చి మాఱుమా
టాడక యున్నమజ్జనకునంసతలంబునఁ బెట్టి దుర్మద
క్రీడఁ జరించురాజు హరకేశవు లాఁగినఁ జచ్చు నేటితో
నేడవనాఁడు తక్షకఫణీంద్రవిషానలహేతిసంహతిన్.

వ. అని శమీకమహామునికుమారుం డయినశృంగి పరీక్షిన్నరేంద్రుని శపియించి నిజాశ్రమంబునకుం జనుదెంచి కంఠలగ్నకాకోదరకళేబరుం డయినతండ్రిం జూచి.

క. ఇయ్యెడ నీకంఠమునను
నియ్యురగకళేబరంబు నిటువైచినయా
దయ్య మిక నేమిసేయుదు
నెయ్యంబులు లేవు సుమ్ము నృపులకుఁ దండ్రీ.

శా. ప్రారంభంబున వేఁటవచ్చి ధరణీపాలుండు మాతండ్రిపై
నేరం బేమియు లేక సర్పశవము న్వేఁ దుగ్రుఁడై వైచినాఁ

డీరితిన్ ఫణి క్రమ్మఱన్ బ్రతుకునో హింసించునో కోఱలన్
రారే తాపసులార దీని దివరే రక్షింపరే క్రొమ్ముక్కాదన్.

వ. అని వెఱపున సర్పంబు దిగుచు నేర్పు లేక యెలుం గెత్తి యేడ్చుచున్న కుమారకు రోదనధ్వని విని యాంగీరసుం డయిన శమీకుండు సమాధి చాలించి మెల్లనఁ గన్నులు దెఱచి మూఁపున వ్రేలుచున్న మృతోరగంబు నీక్షించి తీసి పాఱవైచి కుమారకుం జూచి.

క. ఏకీడు నాచరింపము
లోకులకున్ మనము సర్వలోకసములమున్
శోకింపనేల పుత్రక
కాకోదర మేలవచ్చెఁ గంఠంబునకున్.

వ. అని యడిగినఁ దండ్రికిఁ గొడుకు రాజు వచ్చి సర్పంబు వైచుటయుం దాను శపించుటయును వినిపించిన నమ్మౌని తనదివ్యజ్ఞానంబున నామానవేంద్రుండు పరీక్షిన్నరేంద్రుం డని యెఱింగి కొడుకువలన సంతసింపక యిట్లనియె.

క. బెట్టిద మగుశాపమునకుఁ
దట్టపుద్రోహంబు గాదు ధరణీకాంతుం
గట్టా యేల శపించితి
పట్టీ తక్షకవిషాగ్నిపా లగుమనుచున్.

ఆ. తల్లికడుపులోన దగ్ధుఁడై క్రమ్మఱఁ
గమలనాభుకరుణఁ గలిగినాఁడు
బలిమి గలిగి ప్రజలఁ బాలించుచున్నాఁడు
దిట్టపడుచ రాజుఁ దిట్టఁ దగునె.

చ. కాపరిలేనిగొఱ్ఱియల కైవడిఁ గంటకచోరకోటిచే
నేపరి యున్న దీభువన మీశుఁడు కృష్ణుఁడు లేమి నిట్టిచో

భూపరిపాలనంబు సమబుద్ధి నితం డొనరింపఁ జెల్లరే
యీపరిపాటిద్రోహమున కిట్లు శపింపఁగ నేల బాలకా.

సీ. పాపంబు నీచేతఁ బ్రాపించె మన కిఁక
రాజు నశించిన రాజ్యమందు
బలవంతుఁ డగువాఁడు బలహీనుపశుదార
హయసువర్ణాదుల నపహరించు
జారచోరాదులు సంచరింతురు ప్రజ
కన్యోన్యకలహంబు లతిశయిల్లు
వైదికం బై యున్న వర్ణాశ్రమాచార
ధర్మ మించుక లేక తప్పిపోవు
నంతమీఁద లోకు లర్థకామంబులఁ
దగిలి సంచరింప ధరణి నెల్ల
వర్ణసంకరములు వచ్చును మర్కట
సారమేయకులము మేరఁ బుత్ర.

ఉ. భారతవంశజుం బరమభాగవతున్ హయమేధయాజనా
చారపరున్ మహానయవిశారదు రాజకులైకభూషణున్
నీరముఁ గోరి నేఁడు మన నేలకు వచ్చిన యర్థిభక్తిస
త్కారము సేసి పంపఁ జనుఁ గాక శపింపఁగ నీకు ధర్మమే.

క. భూపతికి నిరపరాధము
శాపముదా నిచ్చె బుద్ధిచాపలమున మా
పాపఁడు వీఁ డొనరించిన
పాపముఁ దొలఁగింపు కృష్ణ పరమేశ హరీ.

క. పొడిచినఁ దిట్టినఁ గొట్టిన
బడుచుందురు గాని పరమభాగవతులు దా

కొడఁబడరు మాఱుసేయఁగఁ
గొడుకా విభుఁ డెగ్గు సేయఁ గోరఁడు నీకున్.

కం. చెలఁగరు కలఁగరు సాధులు
మిళితములయి పరువడల మేలుం గీడున్
నెలకొని సన్నుతి నాత్మను
గొలయుదు సుఖదుఃఖచయము లుగ్రము లగుచున్.

వ. అని యిట్లు శమీకమహామునీంద్రుఁడు క్షమియింప శక్తి లేక
కొడుకు సేసినపాపంబునకు సంతాపంబు నొంది తనశిష్యు నొక్క-
-మునికుమారునిం బిలిచి యావద్వృత్తాంతం బంతయు రాజున కెఱిం
గించి రమ్మని యనిచె.

---

## రంతిదేవుఁడు.

### కథ.

ఇతఁడు షోడశమహారాజులలో నొకఁడు. భూతదయ గలవాఁడు సత్త్వగుణ ప్రధానుఁడు. శాంతిశమదమాది కల్యాణగుణములచేఁ బెక్కుహాయనంబులు ప్రజాపాలన మొనర్చి యైహికవిభవ మనిత్యముగా నెఱింగి సొత్తెల్ల బీదసాదలకుఁ బంచిపెట్టి తనచేత నొకకాసైన లేకుండుటచే నలువదియొనిమిదిదినంబు లేమి యుం దినక నుండుతఱి నొక దినంబున దివ్యాన్నంబు మధురరసంబులును, పానీయంబులును, సంప్రాప్తము కాఁగాఁ దాను భుజించి క్షుద్బాధను నివారించుకొన యత్నించుచుండ నప్పుడె యొక బ్రాహ్మణుఁ డాహారముకొఱకు రంతిదేవుని కడ వేఁడ నప్పటికిఁ దనకుఁ గల్గినయాహారంబులోఁ దత్కాలమున నే వానికి సగ మొసంగి మిగిలినసగము తాను భుజింప యత్నించుసమయమున నొక్కశూద్రజనుండు చనుదెంచి యన్నాతురుం డై మహానుభావుం డైనరంతిదేవుని వేఁడఁ దన కని నిలుపుకొన్న యాహారములో సగపాలు వాని కొసంగె. అప్పుడె కొన్నిశునకములు గుంపుగా మిక్కిలి యాఁకలిగొని చనుదేర వానిం గని యాహారశేషము వాని కొసఁగె. పిమ్మట ముహూర్తమాత్రంబు వ్యవధిగల కాలంబున నొక్కచండాలుండు తూలి తూలి పడుచు నన్నాతురుండు ప్రాణావశిష్టుండు నై వచ్చి యమ్మహానుభావుని బ్రార్థింపఁ దనకు నలువదియొనిమిది దినముల

నుండి యాహారము లేకపోయినను దన యాహారములో మొదట బ్రాహ్మణునకు సగము పిమ్మట మిగిలినదానిలో సగము శూద్రునకును మిగిలినయాహారము కుక్క-లకు నొసంగి తాను రిక్తుఁడై యుండుటవలనఁ జేయునది లేక, చండాలునితో “నేను పానీయంబుమాత్రము గలిగి యుంటిని. భోజనసంభారము లన్నియు సరిపడెను. కావున నిప్పానీయంబులతోఁ దృప్తి పొందు” మని కోరి శుద్ధమైనయంతఃకరణములో వానిపాత్రయందు జలం బిడెను. అప్పుడు పిపీలికాదిబ్రహ్మపర్యంతము సర్వభూతములయందు నేకరీతిని సమాదరణ గలిగి భూతదయాపరుం డైనరంతిదేవుని దేవతలు కని పరమానందమును బొంది “యింతియన నిన్ను పరీక్షించినవారము మేమే” యని వాక్రుచ్చిరి. అప్పుడు రంతిదేవుఁ డానందమును బొంది వారి నేకోరికలుఁ గోరకయె కర్మఫలత్యాగి యై తుదకు పరమపదవిం జెందెను.

నీతి—ఎంత గొప్పవాఁ డైనను నే నింతవాఁడ నని విఱ్ఱవీగక వీఁ డధికుఁడు వీఁడల్పుఁడు నను భేదము జూపక యాపత్సమయములయందు స్వార్థత్యాగముఁ జూపి సర్వ భూతదయాసత్త్వముఁ గలిగి పరోపకారవృత్తి గలమహాపురుషుఁడు రంతిదేవునివలె నిహమునఁ గీర్తియుఁ బరమున సుగతియుఁ బొంది సుఖింపఁ గలఁడు. కావున స్వార్థత్యాగమును భూతదయయు నావశ్యకములు.

సీ. రాజవంశోత్తమ రంతిదేవునికీర్తి
యేల చెప్పఁగ వినుమిందునందు
నారాజు దనసంచితార్థంబు లన్నియు
నొసఁగె దీనుల కిచ్చి యిచ్చి
సకుటుంబుఁడై ధైర్యసంయుతుండై నీద
యై కూడు నీరు లేక ధరవృత్తి
నెం [illegible] నలుబదియెనిమిదిదివసము
ల్చరియింప నొకదివసంబు రేపు
నెయ్యి పాయసంబు నీరును గలిగిన
బహుకుటుంబభారభయముతోడ
నలసినీరువట్టు నాఁకలియును మిక్కి-
లొదవఁ జూచి కుడువ నుత్సహించె.

వ. అయ్యవసరంబున,

సీ. అతిథిభూసురుఁ డొక్కఁ డాహారమడిగినఁ
గడపక ప్రియముతో గారవించి
హరిసమర్పణ మంచు నన్నంబులో సగ
మిచ్చిన భుజియించి యేగె నంతఁ
దంతలో నొకశూద్రుఁ డశనార్థియై వచ్చి
పొడసూప లేదనలేక యతనికి
నున్నయన్నములోన నొకభాగ మిచ్చిన
సంతుష్టుఁడై వాఁడు చనిన వెనుక
కుక్కగమియుఁ దాను నొక్కఁ డేతేర నా
యన్నశేష మిచ్చె నన్నియుంబు
లాఁడి మ్రొక్కి పంప నోడక చండాలుఁ
డొక్కఁ డరుగుదెంచి చక్క నిలిచి.

క. హీనుఁడఁ జండాలుండను
మానవకులనాథ దప్పి మానదు నవలం
బోనేర నీకుఁ జిక్కిన
పానీయము నాకుఁ బోసి పంపంగదనే.

వ. అనిన వానిదీనాలాపంబులకుఁ గరుణించి యిట్లనియె.

ఉ. అన్నము లేదు కొన్ని మధురాంబువు లున్నవి త్రావుమన్న ర
మ్మన్న శరీరధారులకు నాపదవచ్చిన వారి యాపద
గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుటకన్న నొండు మే
లున్నదె నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడ సుమ్ము పుల్కసా.

వ. అని పలికి.

మ. బలవంతం బగునీరువట్టున నిజప్రాణాంతమై యున్నచో
నలయం డేమియు విహ్వలజ్వరము నారాటంబు ఖేదంబు నా

జలదానంబున నేఁడు మానుసనుచు సర్వేశ్వరాధీనుఁడై
జలము లొసఁగెను రంతిదేవుఁడు దయం జండాలపాత్రంబునన్.

వ. తదనంతరంబ బ్రహ్మాదిదేవతలు సంతోషించి రంతిదేవునికి మేలు సేయఁ దలంచి నిజాకారంబులతో ముందర నిలువంబడి యా రాజు ధైర్యపరీక్షార్థంబు దమరు సేసినవృషలాదిరూపంబులగు విష్ణుమాయ నెఱింగించిన నానరేంద్రుం డందఱకి నమస్కరించి.

క. వారల నేమియు నడుగక
నారాయణభక్తి దనమనంబున వెలుఁగన్
ధీరుం డాతఁడు మాయా
పారజ్ఞుం డగుచుఁ బరమపదమునుం బొందెన్.

క. ఆరాజున్నిఁ గొలిచిన
వారెల్లఁ దదీయయోగవైభవమున శ్రీ
నారాయణచింతనులై
చేరిరి యోగీశులగుచు సిద్ధపదంబున్.

---

## కుచేలుఁడు.

---

### కథ.

ఇతఁడు కృష్ణసఖుఁడు సహాధ్యాయి నిరుపేద పరమసాత్వికుఁడు భూతదయాపరుఁడు సద్బ్రాహ్మణుఁడు బహుసంతానవంతుఁడు. దారపుత్త్రాదులతో ఘోరమైనదారిద్ర్యముచే నన్నాపన్నులై కాలముఁ గడుపుచు నెట్టకేలకు దారిద్ర్యబాధ ననుభవింపఁ జాలక తానెట్లున్నను బిల్లలరాయిడి సహింపలేక భయము వదలి పతివ్రతాశిరోమణి యయినకుచేలునిభార్య భర్త కభిముఖియై “మహానుభావా! ఘోరమైనదారిద్ర్యసాగరమునుం దరించుటకు సాధనము దొరకక సర్వదా భయంకరమగుబాధ పడుచుంటిమి. తపశ్శాలు లగుతమకుఁ దెలియకున్నది. కావున నాచిన్నవిన్నప మాలించి తమర బాల్యసఖు లగుశ్రీకృష్ణభగవానులను జేరి యమ్మహామహానిశరణసన్నిధిని మనదారిద్ర్య మింతయు విన్నవించిన నూరక పోనేరదు. అమ్మహా

మహాత్ముని జేరంజనుట కర్తవ్య" మని ప్రార్థింప నంగీకరించి ప్రయాణమై పోవుతఱిని కుచేలుండు భార్యతో "రిక్తహస్తేన నోపేయాత్ రాజానం దైవతం గురుం" మ్మను నార్యోక్తి ననుసరించి యమ్మహానుభావునకుఁ గొలఁది గొప్ప భేదంబులు లేవు ఏది యైనను గానుక గలదా యని భార్య నడుగఁ గొన్ని పృథుకతండులంబులు విభుని శిథిలవస్త్రంబుకొసను ముడిచి ప్రయాణముచేసి పంపెను. అమ్మహాభాగవతోత్తముఁడు సాక్షాత్పరబ్రహ్మస్వరూపుఁ డగుటచేఁ దాను చేయుప్రయాణమున సాక్షాద్భగవంతుని ప్రత్యక్షదర్శనము లభించు నని యానందపరవశుఁడై కృశుఁ డయినట్టియు బలహీన మైనట్టియు శరీరము గలవాఁ డయినను నమ్మహామహునిదర్శనమునం దుత్సాహ కుతూహలమానసుండై వేగంబున ద్వారకానగరంబు జేరంజని శ్రీకృష్ణమందిరంబుఁ జొచ్చునెడ ననంతకల్యాణగుణగరిష్ఠుం డగుశ్రీకృష్ణుండు విలాసినీముఖ్యలతో హావ భావాదిచేష్టలచే శృంగారరసం బాస్వాదించుచుండియు మహానుభావుండును యదృచ్ఛాగతుండును నగుకుచేలునిదర్శించి దిగ్గన లేచి సరససల్లాపము లాడుచుండుహా రత్నములను వీడి పేదకుఁ బెన్నిధానంబు దొరికినచందంబున నపరిమితహర్షాయత్త మానసుం డయి బాల్యసఖుం డగునాతనిఁ దీరనిప్రేమచే గాఢాలింగనంబు సేసి తాను ము న్నున్నశయ్యకుం జేర్చి పాదంబు లొత్తుచు వింజామరంబులచే విసరుచుఁ బలు తెఱంగుల సంతుష్టాంతరంగునిం జేయుచు బాల్యంబున సహాధ్యాయులుగా సాందీపుఁ డనుమహామహునియొద్ద విద్యాభ్యాసము చేయుచోఁ దా మాచరించినపలువిధము లయినపనులను జ్ఞప్తికిఁ దెచ్చుచుఁ బరమానందభరితుఁడయి శ్రీకృష్ణుఁ డాతనిజీర్ణ వస్త్రమున ముడిచి యున్నపృథుకతండులములు పరమాదరంబున నారగించి మహా దరిద్రుఁ డగు నాతని కష్టైశ్వర్యంబుల నొసంగి పంపెను.

నీతి—అల్పుఁ డైనను బరమదరిద్రుఁ డయినను సత్యపరివర్తకుఁ డయి ధర్మ మార్గముఁ దప్పి సంచరింపనిమహాపురుషుండు తనసద్గుణపుంజ మనుమార్గముచేఁ బరమే శ్వరుఁ డయినశ్రీకృష్ణుని యనుగ్రహమునకుఁ బాత్రుఁ డయి కుచేలునివలె నిహమున నైశ్వర్యమును బరమున శాశ్వతసుఖమును బొందును.

తా నధికుఁడ నని యించుకంతేని గర్వము లేక మిక్కిలి బీదవాఁడును కుచ్ఛితచేలుండును నగుకుచేలునియెడఁ బరమభృత్యవృత్తిచే మైత్రిం జూపి యాకటిక దరిద్రుని బరమైశ్వర్యభరితుం జేసినశ్రీకృష్ణునిపోలిక నిర్గర్వు లయి మిత్రభావంబు మరవక యెల్లరు మెలఁగవలెను.

## కుచేలోపాఖ్యానము.

క. హలధరుఁ డమర్త్యచరితుం, డలఘుభుజాబలుఁడొనర్చు సద్భుతకర్మం
బులు పెక్కు నాల్గు మొగములు, గలమేటియు లెక్కఁబెట్టఁగలఁడె నరేంద్రా.

చ. అనిన మునీంద్రుఁ గన్గొని ధరాధిపుఁ డిట్లను బద్మపత్రలో
చనునియనంతవీర్యగుణసంపద వేమఱు విన్ననైనను
దనియదు చిత్త మచ్యుతకథావిభవం బొకమాటు వీనుల
న్వినిన మనోజపుష్పశరవిద్ధుఁడు నైన విరామ మొందఁడే.

వ. అదియునుం గాక.

చ. హరి భజియించుహస్తములు హస్తము లచ్యుతుఁ గోరి మ్రొక్కు త
చ్ఛిరము శిరంబు చక్రధరుఁ జేరినచిత్తము చిత్త మిందిరా
వరుఁ గనుదృష్టి దృష్టి మురవైరి నుతించినవాణి వాణి య
తురుకథ లానుకర్ణములు కర్ణములై విలసిల్లుఁ బో భువిన్.

క. హరిపాదతీర్థసేవా
పరుఁడై విలసిల్లునట్టిభాగవతుని వి
స్ఫురితాంగము లంగము లా
పరమేశ్వరు నెఱుఁగ నాఁడు బలుకు మునీంద్రా.

సీ. అనుఁడు వేదవ్యాసతనయుఁ డాయభిమన్యు
తనయునిఁ జూచి యిట్లనియెఁ బ్రీతి
జనవర గోవిందసఖుఁడు కుచేలుండు
నా నొప్పువిప్రుండు మానధనుఁడు
విజ్ఞానరాగాదివిరహితస్వాంతుండు
శాంతుండు ధర్మవత్సలుఁడు ఘనుఁడు
జితేంద్రియుఁడు బ్రహ్మవేత్త దారిద్ర్యంబు
బాధింప నొరులఁ గార్పణ్యవృత్తి.

నమగఁ గోవిద తనకుఁ దానిచ్చినట్టి
కాసుపదివేలనిష్కములుగాఁ దలంచి
యాత్మ మోదించి పుత్రదారాభిరతుఁ
డొకవిధంబున నడపుచు నుండునంత.

సీ. లలితపతివ్రతాతిలకంబు వంశాభి
జాత్య తద్భార్య దుస్సహదరిద్ర
పీడచేఁ గడునొచ్చి పెదవులు దడుపుచు
శిశువు లాఁకటిచిచ్చుచేఁ గృశించి
మలమల మాఁడుచు మానసం బెరియంగఁ
బట్టెఁడో రెము మాకుఁ బెట్టు మనుచుఁ
బత్రభాజనధృతపాణులై తనుఁజేరి
వేఁడ వీనులు చుఱుజూఁడినట్లు
యైన నొకనాఁడు వగచి నిజాధినాథుఁ
జేరి యిట్లని పలికె నో జీవితేశ
తట్టుముట్టాడునిట్టి పేదఱిక మిట్లు
నొంప దీనికుపాయ మూహింపవైతి.

వ. అని మఱియు నిట్లనియె.

తే. బాలసఖుఁ డైనయప్పద్మపత్రనేత్రుఁ
గాన నేగి దారిద్ర్యాంధకారమగ్న
యైనమము నుద్ధరింపుము హరికృపాక
టాక్షరవిదీప్తి వడసి మహాత్మ నీవు.

వ. మఱియును.

చ. వరదుఁడు సాధుభక్తజనవత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా
వరుఁడు దయాపయోధి భగవంతుఁడు కృష్ణుఁడు దా గుశస్థలీ

పురమున యాదవప్రకరము ల్భజియింపఁగ నున్నవాఁడు మీ
రరిగిన మిమ్ముఁ జూచి విభుఁ డప్పుడ యిచ్చు ననూనసంపదల్.

ము. కలలోనం దను మున్నెఱుంగనిమహాకష్టాత్ముఁ డై నట్టిదు
ర్బలుఁ డాపత్సమయంబున న్నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ
దలఁపం దా మదిమెచ్చి యార్తిహరుఁడై తన్నైన నిచ్చు న్నని
శ్చలభక్తి న్భజియించువారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్.

క. అనిపలికిన సమ్మానిని
సునయోక్తుల కలరి భూమిసురుఁ డాకృష్ణు
ఁగన నేగుట యిహపరసా
ధనమగు నని మదిఁ దలంచి తనసతితోడన్.

తే. నీవు సెప్పినయట్ల రాజీవనేత్రు
పాదపద్మంబు లాశ్రయింపంగఁ జనుట
పరమశోభన మాచక్రపాణి కిపుడు
గాను కేమైనఁ గొంపోవఁ గలదె మనకు.

తే. అనిన నయ్యింతి యౌఁగాక యనుచు విభుని
శిథిలవస్త్రంబుకొంగునఁ బృథుకతండు
లమ్ము లొకకొన్ని ముడిచి నెయ్యమున ననుపఁ
జనియె గోవిందదర్శనోత్సాహి యగుచు.

వ. అట్లు చనుచుం దనమనంబున.

సీ. ద్వారకానగరంబు నేరీతిఁ జొత్తును
భాసురాంతఃపురవాసియైన
యప్పుండరీకాక్షు నఖిలేశు నెబ్భంగి
దర్శింపఁగలనొ తద్ద్వారపాలు
రెక్కడివిప్రుఁడ విందేలవచ్చెద
వని యడ్డపెట్టిరే నపుడు వారి

కేమైన బరిదాన మిచ్చి చొచ్చెద నన్న
నూహింప నర్థశూన్యుండ

ఐన నాభాగ్య మతనిద యార్ద్రదృష్టి
గాక తలపోయఁగా నొండు గలదె యాతఁ
డేల నన్ను నుపేక్షించు నేఁటిమాట
లనుచు నాద్వారకాపుర మతఁడు సొచ్చి.

వ. ఇట్లు ప్రవేశించి రాజమార్గంబునం జనిచని కక్ష్యాంతరంబులు గడచి
చని ముందట

సీ. విశదమై యొప్పుషోడశసహస్రాంగనా
కలితవిశాలసంగతిఁ దనర్చు

మహనీయతపనీయమణిమయగోపుర
ప్రాసాదసౌధహర్మ్యములు సూచి

మనము బ్రహ్మానందమును బొందఁ గడు నుబ్బి
సంతోషబాష్పము ల్జడిగొనంగ

ప్రకటమై విలసిల్లునొకవధూమణిమందిరమున
నింతులు చామరములు వీవఁ

దలరు మృదుహంసతూలికాతల్పమందుఁ
దాను బ్రియయును బహువినోదములఁ దనరి
మహితలావణ్యమన్మథమన్మథుండు
ననఁగఁ జూపట్టుపుండరీకాయతాక్షు.

సీ. ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ
గరుణాలవాలు భాసురకపోలుఁ

గౌస్తుభాలంకారుఁ గామితమందారు
సురుచిరలావణ్యు సురశరణ్యు

హార్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయానుఁ గౌశేయపరిధానుఁ
బన్నగశయను నబ్జాతనయను
మకరకుండలసద్విభూషు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు.

మ. కని డాయంజనునంతఁ గృష్ణుఁడు దళత్కంజాక్షుఁ డప్పేదవి
ప్రుని నశ్రాంతదరిద్రపీడితుఁ గృశీభూతాంగుఁ జీర్ణాంబరు
న్ఘనతృష్ణాతురచిత్తు హాస్యనిలయు న్ఖండోత్తరీయు న్గచే
లుని నల్లంతనె చూచి సంభ్రమవిలోలుండై దిగెన్ దల్పమున్.

క. కరమర్థి నెదురుగాఁ జని
పరిరంభణ మాచరించి బంధుస్నేహ
స్ఫురణం దోడ్తెచ్చి సమా
దరమునఁ గూర్చుండఁబెట్టెఁ దనతల్పమున్.

తే. అట్లు కూర్చుండఁబెట్టి నెయ్యమునఁ గనక
కలశసలిలంబుచేఁ గాళ్ళుగడిగి భక్తిఁ
దజ్జలంబులు దనమస్తకమునఁ దాల్చి
లలితమృగమదఘనసారమిళితమైన.

తే. మలయజము మేన జొబ్బిల్ల నలఁది యంత
శ్రమము వాయంగఁ దాళవృంతమున విసరి
బంధురామోదకలితధూపంబు లొసఁగి
మించుమణిదీపముల నివాళించి మఱియు.

వ. సురభికుసుమమాలికలు సిగముడిం దుఱిమి కర్పూరమిళితతాంబూ

లరుఁబు లిడి ధేనువు నొసంగి సాదరంబుగా స్వాగతం బడిగిన నప్పు డవ్విప్రునకు మేనం బులకాంకురంబు లంకురింప న్నానందబాష్పజల బిందుసందోహం బయ్యె. అట్టియెడం బద్మలోచనుండు మన్నించు నంగనామణి యగురుక్మిణి కరకంకణంబులు మొరయం జామరలు వీవం దజ్జాతవాతంబున ఘర్మసలిలంబు నివారించుచుండం జూచి శుద్ధాంతకాంతానివహంబులు తమమనంబుల నద్భుతం బంది యి ట్లనిరి.

ఉ. ఏమితపంబు చేసెనొకొ యీధరణీదివిజోత్తముండు తొ
ల్లామున యోగివిస్ఫురదుపాస్యకుఁడై తనరారునీజగ
త్స్వామి రమాధినాథు నిజతల్పమున న్వసియించి యున్నవాఁ
డీమహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్.

వ. అదియునుంగాక.

చ. తనమృదుతల్పమందు వనితామణి మైసరమాలలామపొం
దును నెడగాఁ దలంపక యదు ప్రవరుం డెదురేగి మోదము
న్దనుకగఁ గౌఁగిలించి యుచితక్రియల న్పరితుష్టుఁ జేయుచు
న్వినయము న్భజించె ధరణీసురుఁ డెంతటిభాగ్యవంతుఁడో.

వ. అను నయ్యవసరంబున.

క. మురసంహారుఁడు కుచేలుని
కరము గరంబునఁ దెమల్చి కడఁక న్మన మా
గురుగృహమున వర్తించిన
చరితము లని కొన్ని నుడివి చతురత మఱియున్.

సీ. బ్రాహ్మణోత్తమ వేదపాఠనలబ్ధ ద
క్షిణ గలచారువంశంబువలనఁ
బరిణయం బైనట్టిభార్య సుశీలవ
ర్తనములఁ దగ భవత్సదృశ యగునె

తలఁప గృహక్షేత్రధనదారపుత్రాదు
లందు నీచిత్తంబు చెందకుంట
తోఁచుచున్నది యేను దుది లోకసంగ్రహా
ర్థంబు కర్మాచరణంబు సేయు
గతి మనంబునఁ గామమోహితులు గాక
సక్తిమై యుక్తకర్మంబు లాచరించి
ప్రకృతిసంబంధమును బాసి భవ్యనిష్ఠ
దవిలియుండురు కొంద ఱుత్తములు భువిని.

వ. అని మఱియు నిట్లనియె.

క. ఎఱుఁగుదె గురుమందిరమునఁ
దెఱఁ గొప్పఁగ మనకు సతఁడు తెలుపఁగ వరుసన్
ఎఱుఁగఁగ వలసినయర్థము
లెఱిఁగి పరిజ్ఞానమహిమ లెఱుఁగుట లెల్లన్.

వ. అని మఱియు గురుప్రశంస సేయం దలంచి యిట్లనియె.

తే. తివిరి యజ్ఞానతిమిరప్రదీప మగుచు
నవ్యయం బైనబ్రహ్మంబు ననుభవించు
భరితసత్త్వుండు సత్కర్మనిరతుఁ డతుఁ
భూసురశ్రేష్ఠుఁ డనఘుండు బుధనుతుండు.

వ. అమ్మహాత్మునివలన సకలవర్ణాశ్రమంబులవారికి నేను విజ్ఞానప్రదుండ నగుగురుండనై యుండియు గురుభజనంబు పరమధర్మం బని యాచరించితి నదిగావున.

క. భూసురులకెల్ల ముఖ్యుఁడ
నై సకలకులాశ్రమంబులందుల నెపుడున్
ధీసుజ్ఞానప్రదుఁ డన
దేశికుఁ డన నొప్పుచుందు ధృతి నెల్లెడలన్.

తే. అట్టివర్ణాశ్రమంబులయందు నర్థ
కుశలు లగువారు నిఖిలైకగురుఁడ నైన
నాదువాక్యంబుచే భవార్ణవము వెలుచ
దాఁటుదురు మత్పదాంబుజధ్యానపరులు.

వ. అదియునుంగాక సకలభూతాత్మకుండ నైనయేను దపోవ్రతయజ్ఞదాన శమదమాదులచేత సంతసింపను. గురుజనంబులఁ బరమభక్తి సేవించువారలం బరిణమింతు నని చెప్పి మఱియు మనము గురుమందిరంబున నున్నయెడల గురుపత్నినియుక్తుల మై యింధనార్థం బడవికిం జనినయెడ.

సీ. ఘుమఘుమారావసంకులఘోరజీమూత
పటలసంఛన్నాభ్రభాగ మగుచుఁ
జటులఝంఝానిలోత్కటసముద్ధూతనా
నావిధజంతుసంతాన మగుచుఁ
జండదిగ్వేదండతుండసన్నిభాఖండ
వారిధారాపూర్ణవసుధ యగుచు
విద్యోతమానోగ్రఖద్యోతకిరణాభి
ద్విద్యుద్ద్యుతిచ్ఛటావిభవ మగుచు,
నడరి జడిగుఱియ సినుఁడు నస్తమింప
ఘోరనీరంధ్రనిబిడాంధకార మేచి
సూచికాభేద్యమై వస్తుగోచరంబు
గానియట్లుండ మనము సవ్యాపఁ దడిసి.

తే. బయలు గొందియుఁ బెనుమిట్టుపల్లములును
రహితసహితస్థలంబు లేర్పఱుపరాక
యున్నయత్తఱి మన మొకరొకరిచేతు
లూఁతగాఁ గొని నడుచుచు నుండునంత.

తలఁప గృహక్షేత్రధనదారపుత్రాదు
లందు నీచిత్తంబు చెందకుంట
తోఁచుచున్నది యేను దుది లోకసంగ్రహా
ర్థంబు కర్మాచరణంబు సేయు
గతి మనంబునఁ గామమోహితులు గాక
సర్థిమై యుక్తకర్మంబు లాచరించి
ప్రకృతిసంబంధమును బాసి భవ్యనిష్ఠ
దవిలియుందురు కొందఱుత్తములు భువిని.

వ. అని మఱియు నిట్లనియె.

క. ఎఱుఁగుదె గురుమందిరమునఁ
దెఱఁ గొప్పఁగ మనకు సతఁడు తెలుపఁగ వరుసన్
ఎఱుఁగఁగ వలసినయర్థము
లెఱిఁగి పరిజ్ఞానమహిమ లెఱుఁగుట లెల్లన్.

వ. అని మఱియు గురుప్రశంస సేయం దలంచి యిట్లనియె.

తే. తివిరి యజ్ఞానతిమిరప్రదీప మగుచు
సవ్యయం బైనబ్రహ్మంబు ననుభవించు
భరితసత్త్వుండు సత్కర్మనిరతుఁ డతుల
భూసురశ్రేష్ఠుఁ డనఘుండు బుధనుతుండు.

వ. అమ్మహాత్మునివలన సకలవర్ణాశ్రమంబులవారికి నేను విజ్ఞానప్రదుండ
నగుగురుండనై యుండియు గురుభజనంబు పరమధర్మం బని యాచ
రించితి నదిగావున.

క. భూసురులకెల్ల ముఖ్యుఁడ
నై సకలకులాశ్రమంబులందుల నెపుడున్
ధీసుజ్ఞానప్రదుఁ డన
దేశికుఁ డన నొప్పుచుండు ధృతి నెల్లెడలన్.

తే. అట్టివర్ణాశ్రమంబులయందు నర్థ
కుశలు లగువారు నిఖిలైకగురుఁడ నైన
నాదువాక్యంబుచే భవార్ణవము పెలుచ
దాఁటుదురు మత్పదాంబుజధ్యానపరులు.

వ. అదియునుంగాక సకలభూతాత్మకుండ నైన యేను దపోవ్రతయజ్ఞదాన శమదమాదులచేత సంతసింపను. గురుజనంబులఁ బరమభక్తి సేవించు వారలం బరిణమింతు నని చెప్పి మఱియు మనము గురుమందిరంబున నున్నయెడల గురుపత్నీనియుక్తుల మై యింధనార్థం బడవికిం జనినయెడ.

సీ. ఘుమఘుమారావసంకులఘోరజీమూత
పటలసంఛన్నాభ్రభాగ మగుచుఁ
జటులఝంఝానిలోత్కటసముద్ధూతనా
నావిధజంతుసంతాన మగుచుఁ
జండదిగ్వేదండతుండనిభాఖండ
వారిధారాపూర్ణవసుధ యగుచు
విద్యోతమానోగ్రఖద్యోతకిరణాళి
ద్విద్యుద్ద్యుతిచ్ఛటావిభవ మగుచు,
నడరి జడిగురియ సినుఁడు నస్తమింప
భూరినీరంధ్రనిబిడాంధకార మేచి
సూచికాభేద్యమై వస్తుగోచరంబు
గానియట్లుండ మనము నవ్వానఁ దడిసి.

తే. బయలు గొందియుఁ బెనుమిట్టుపల్లములును
రహితసహితస్థలంబు లేర్పఱుపరాక
యున్నయత్తఱి మన మొకరొకరిచేతు
లూఁతగాఁ గొని నడుచుచు నుండునంత.

క. వినవిన నెప్పుడు నుడుగక
   వినరెడివలిచేత వడఁకు విడువక మనము
   న్వనచెడి మార్గముఁ గానక
   మసలితి మంతటను నంశుమంతుఁడుఁ బొడిచెన్.

క. తెలతెలవాఱెడివేళ
   న్గలకలమని పలికెఁ బక్షిగణ మెల్లెడల
   న్మిలమిలని ప్రొద్దుపొడుపున
   ధళధళయనుమెఱుఁగు దిగ్వితానము నిండెన్.

క. అప్పుడు సాందీపుఁడు మన
   చొప్పరయుచు వచ్చి వానసోఁకునను వలిం
   జెప్పిరిలుటఁ గని ఖేదం
   బుప్పతిలం బలికె నకట యోవటులారా.

చ. కటకట యిట్లు మాకొఱకుఁగాఁ జనుదెంచి మహాటవి న్సము
   త్కటపరిపీడ నొందితిరి గావున శిష్యులు మాఋణంబు నీ
   గుట కిది కారణంబు సమకూరెడిఁ బో యిటమీఁద మీకు వి
   స్ఫుటధనబంధుదారబహుపుత్రవిభూతిజయాయురున్నతుల్.

క. అని గారవించి యాయన
   మనలం దోడ్కొనుచు నాత్మమందిరమునకుం
   జనుదెంచుట లెల్లను నీ
   మనమునఁ దలఁతే యటంచు మఱియు న్బలికెన్.

వ. అనఘా మన మధ్యయనంబు సేయుచు నన్యోన్యస్నేహవాత్స ల్యంబులం జేయుకృత్యంబులు మఱవవు గదా యని యవియెల్లం దలంచి యాదుమాధవుమధురాలాపంబులు విని యతనిఁ గనుంగొని కుచేలుం డిట్లనియె.

క. వనజోదర గురుమందిర
   మున మనము వసించునాఁడు ముదమునఁ గావిం

యనినను లేవిప్రయుఁ గలవే
విను మది యట్లుండనిమ్ము విమలచరిత్రా.

క. గురుపతిఁ దలఁచఁగఁ ద్విజగ
ద్గురుఁడ వనం దగినసీవు గురుఁ డనఁ దానొం
డొరుఁ డెవ్వఁ డింతయును నీ
కరయంగ విడంబనంబ యగుఁగాదె హరీ.

వ. అని సాభిప్రాయంబుగాఁ బలికినపలుకులు విని సమస్తభావాభిజ్ఞుం డైనపుండరీకాక్షుండు మందస్మితసుందరవదనారవిందుండగుచు నత నిం జూచి నీ విచ్చటికి వచ్చునప్పుడు నాయందులభక్తిం జేసి నాకు నుపాయనంబుగా నేమిపదార్థంబు దెచ్చితివి. అప్పదార్థంబు లేశ మాత్రం బైనఁ బదివేలుగా నంగీకరింతు. అట్లు గాక నీచవర్తనుండై మద్భక్తిం దగులనిదుష్టాత్ముండు హేమాచలతుల్యం బైనపదార్థంబు నొసంగిన నదియు నామనమ్మునకు సమ్మతంబు గాదు కావున.

క. దళ మైనఁ బుష్ప మైనను
ఫల మైనను సలిల మైనఁ బాయనిభక్తి
న్గొలిచినజను లర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగ నె యేను భుజింతున్.

క. అనిపద్మోదరుఁ డాడిన
వినయోక్తుల కాత్మ నలరి విప్రుఁడు దాఁ దె
చ్చినయడుకులు దగ నర్పిం
పను నేరక మోము వాంచి పలుకక యున్నన్.

వ. అవ్విప్రుండు చనుదెంచినకార్యంబు కృష్ణుండు దనదివ్యచిత్తంబున నెఱింగి యితండు పూర్వభవంబున నైశ్వర్యకాముండై నన్ను సేవింపం డైన నిక్కుచేలుండు నిజకాంతాముఖోల్లాసంబునకై నా యొద్దకుఁ జనుదెంచినవాఁడు. ఇతనికి నింద్రాదులకుం బడయరాని బహువిధంబులైనసంపదశేషంబు లీక్షణంబ యొడఁగూర్పవలయు

నని తలంచి యతండు జీర్ణవస్త్రంబుకొంగున ముడిచి తెచ్చినయయ్యా
డుకులముడియు గని యిది యేమి యని యొయ్యన నమ్ముడియు దన
కరకమలంబులవిడిచి యయ్యడుకులు కొన్ని పుచ్చికొని యివి సకల
లోకంబులను నన్నును బరితృప్తిం బొందింపఁ జాలు నని యప్పుడు.

క. మురహరుఁడు పిడికెఁడడుకులు
కరమొప్పఁగ నారగించి కౌతుకమతియై
మఱియును బిడికెఁడు గొనఁ ద
త్కర మప్పుడు వట్టెఁ గమల కరకమలములన్.

క. సంసారఁగ నితనికి బహు
సంపద లందింప నివియచాలును నీక భ
క్షింపఁగ వలవదు త్రిజగ
త్సంపత్కర దేవదేవ సర్వాత్మ హరీ.

వ. అని యిట్లు వారించె. అక్కుచేలుండును నారాత్రి గోవిందుమంది
రంబునఁ దనకు హృదయానందకరంబు లగు వివిధపదార్థంబు లనుభ
వించి మృదులశయ్యాతలంబున నిద్రించి తనమనంబునం దన్ను
సమధికస్వర్గభోగానుభవుంగాఁ దలంచుచు మఱునాఁ డరుణోదయం
బున మేల్కని కాలోచితకృత్యంబులు దీర్చి యిందిరారమణుండు
దన్నుఁ గొంతద వ్వనిపి యామంత్రితుం జేయఁ జనుచు నందనందనసం
దర్శనానందలోలాత్ముండై తనమనంబున నిట్లనియె.

క. నాపుణ్య మరయ నెట్టిదొ
యాపుణ్యనిధిం బ్రశాంతు నచ్యుతు నఖల
వ్యాపకు బ్రహ్మణ్యునిఁ జి
ద్రూపకుఁ బురుషోత్తమునిఁ బరుం గనుఁగొంటిన్.

సీ. పరికింపఁ గృపణస్వభావుండ నైనట్టి
నేనెడ నిఖిలావనీశుఁ డైన

యిందిరాదేవికి నెనయంగ నిత్యని
వాసుఁడై యొప్పునవ్వాసుదేవుఁ
డీడ న స్నర్థిమైఁ దోడఁబుట్టినవాని
కైవడిఁ గౌఁగిటఁ గదియఁ జేర్చి
దైవంబుగా నన్ను భావించి నిజతల
మున నుంచి సత్క్రియ లన్ని నడపి
చారునిజవధూ కరసరోజాతకలిత
చామరానిలవిగతవిశ్రమునిఁ జేసి
శ్రీకుచాలిప్తచందనాంచితకరాబ్జ
తలమునను నన్నులోత్తె వత్సలత మెఱసి.

వ. కావున.

ఉ. శ్రీనిధి యిట్లు నన్నుఁ బచరించి ఘనంబుగ విత్త మేమియు
న్నీని తెఱంగు గానఁబడె నెన్న దరిద్రుఁడు సంపదంధుఁడై
కానక తన్నుఁ జేరఁ డని కాక శ్రితార్తిహరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తుపరిపూర్ణునిఁగా ననుఁ జేయకుండునే.

వ. అని తనమనంబున వితర్కించుచు నిజపురంబునకుం జని చని
ముందట.

సీ. భానుచంద్రప్రభాభాసమానస్వర్ణ
చంద్రకాంతోపలసౌధములును
గలకంఠశుకనీలకంఠసముత్కంఠ
మానితకూజితోద్యానములును
ఫుల్లసితాంభోజహల్లకకల్హార
కైరవోల్లసితకాసారములును
మణిమయకనకకంకణముఖాభరణవి
భాజితదాసదాసీజనములు

గలిగి చెలువొందునదనంబు గాంచి విస్మ
యమును బొందుచు నెట్టిపుణ్యాత్ముఁ డుండు
నిలయమొక్కొ యపూర్వమై నెగడె మహిత
వైభవోన్నతలక్ష్మినివాస మగుచు.

వ. అని తలపోయుచున్నయవసరంబున.

తే. దివిజవనితలఁ బోలెడు తెఱవ లపుడు
డాయ నేతెంచి యిందు విచ్చేయుఁ డనుచు
విమలసంగీతనృత్యవాద్యములు చెలఁగ
గరిమఁ దోడ్కొనిచని రంతిపురమునకును.

వ. ఇట్లు చనుదేర నతనిభార్య యైనసతీలలామంబు దనమనంబున
నానందరసమగ్న యగుచు నప్పుడు.

సీ. తనవిభురాక ముందటఁ గని మనమున
హర్షించి వైభవం బలర మనుజ
కామినీరూపంబు గైకొన్నయిందిరా
వనితచందంబునఁ దనరుచున్న
కలకంఠి తనవాలుకన్నుల కేళ్ళవల
నానందబాష్పంబు లంకురింప
పతనిపాదంబుల కాత్మలోఁ బ్రొక్కి భా
వంబున నాలింగనంబుచేసె.
నాథరాదేవుఁ డతులదివ్యాంబరాభ
రణవిభూషితయై రతిరాజుసాయ
కములగతి నొప్పుపరిచారికలు భజింప
లలితసౌభాగ్య యగునిజలలనఁ జూచి.

క. ఆనాకీరత్నంబును
దానును ననురాగరసము దళుకొత్తఁగ ని

త్యానందము నొందుచుఁ జెం
పూనినహరిలబ్ధవైభవోన్నతి మెఱయన్.

సీ. కమనీయపద్మరాగస్తంభకంబులుఁ
గోమరాళస్ఫటికంపుకుడ్యములును
మరకతనవరత్నమయకవాటంబులుఁ
గీలితహరినీలజాలకములు
దీపితచంద్రకాంతోపలవేదులు
నంచితవివిధపదార్థములును
దగుహంసతూలికాతల్పంబులును హేమ
లాలితశయనస్థలములు దనరు
సమధికోత్తుంగభద్రపీఠములును సిరులు
మానితోన్నతచతురంత యానములును
వలయునద్వస్తుపరిపూర్ణవాటికలును
గలిగి చెలువొందుమందిరం బెలమి నొచ్చి.

వ. సుఖంబున నుండునట్టియెడం దనదు మనోవికారంబులు వోడముకుండ వర్తించుచు నిర్మలం బగుతనమనంబున నిట్లని చింతకాలం బత్యంతదురంతం బగుదారిద్ర్యదుఃఖార్ణవంబున మునింగి యున్న నాకుం గడపటం గలిగినవిధంబున నిప్పుడు.

ఆ. ఎన్నఁ (గోత్రత్రైనయిట్టిసంపదలు నా
కబ్బె నెల్ల హరిదయావలోక
నమునఁ జేసి కాదె నలినాక్షుసన్నిధి
కర్థి నగుచు నేను నరుగుటయును.

క. నను నావృత్తాంతంబును
దనమనమునఁ గనియు నేమి దడవక సనుఁ బొ
మ్మని యీసంపద నెల్లను
నొనరఁగ నొడఁగూర్చి నన్ను నొడయునిఁ జేసెన్.

వ. అట్టిపురుషోత్తముండు భక్తినిష్ఠులైనసజ్జనులు లేశమాత్రం బగు పదార్థంబైన భక్తిపూర్వకంబుగా సమర్పించిన నది కోటిగుణితంబుగాఁ గైకొని మన్నించుటకు నిది దృష్టాంతంబు గాదె. మలిన దేహుండును జీర్ణాంబరుండు నని చిత్తంబు హేయంబుగాఁ బాటింపక నాచే నున్నయడుకు లాదరంబున నారగించి నన్నుం గృతార్థునిం జేయుట తననిర్హేతుకదయం గాదె. అట్టికారుణ్యసాగరుం డైన గోవిందునిచరణారవిందంబులయందులభక్తిప్రాభవంబు లగుంగాక యని యప్పుండరీకాక్షునియందుల భక్తితాత్పర్యంబునం బట్టినమే తుండై నిఖిలభోగంబులయందు నాసక్తిం బొరయక రాగాదివిరహితుండును నిర్వికారుండునునై యఖిలక్రియలందు ననంతునియనంత ధ్యానసుధారసంబునం జొక్కుచు విగతబంధనుండై యపవర్గప్రాప్తి నొందె మఱియును.

ఆ. దేవదేవుఁ డఖిలభావజ్ఞుఁ డాశ్రిత
వరదుఁ డైనహరికి ధరణిసురులు
దైవతములు గాన ధారుణీదివిజుల
కంటె దైవ మొకఁడు గలఁడె భువిని.

---

భీష్ముఁడు—స్వార్థత్యాగ ప్రతిజ్ఞ.

—:o:—

కథ.

భీష్ముండు శంతనమహారాజకుమారుఁడు. శంతనుఁడు భీష్మునికి యువరాజ పట్టాభిషేకము చేసి యనన్యవ్యాపారుండై యమునానదీతీరంబున వేటలాడుచుఁ గ్రుమ్మరునాఁ డపూర్వసురభిగంధం బాఘ్రాణించి దానివచ్చినవల నారయుచు నఱిగి యమునాతీరంబున నావ నడిపెడియొకలావణ్యవతిం జూచి యాకన్యను వివాహమాడఁ దాను కృతనిశ్చయుఁ డయి యాయువతితండ్రి యగుదాశరాజునొద్ద కేగి సంభావితుం డై తనకోరిక వాని కెఱిఁగించె. అతఁడు తనకూఁతునకుఁ బుట్టినకుమారుకు రాజ్య మొసంగుట కంగీకరించినచోఁ గన్య నిచ్చెద నని చెప్పెను. అందులకు శంతనుం

[illegible] తననగరమునకు మరలి పితృకార్యావసరుండై యంతఃపురంబున నుండెను. చింతించుటం గని తనయుఁడు గాంగేయుఁడు తండ్రివద్ద కేగి కారణ మారసి వృద్ధా మాత్యపురోహితసుహృజ్జనంబులతో విచారించి యనంతరము దాశరాజునొద్ద కేగి తనతండ్రికి యోజనగంధి నిచ్చి వివాహము చేయవలసిన దని యడిగెను.

అప్పుడు తండ్రియైన శంతనునితోఁ బూర్వము నుడివిన రాజ్యవిషయకము లైన వాక్యములే మహానుభావుఁ డైన భీష్మునితో నొక్కి చెప్పెను. అంతటఁ దానట్లు చేసెద నని ప్రసిద్ధు లగు పృథ్వీపతులయెదుటఁ బ్రతిజ్ఞ పట్టెను. అది విని దాశరాజు భీష్మునితో "నీవట్లొనరించిన నొనరింతువుగాక. నీవు వివాహమైనతరువాతఁ గలుగు నీసుతు లిందుల కంగీకరింతురా? అప్పు డేమిసేయఁ గలవాఁడవు" అని యడిగెను. అందుకుఁ బితృహితార్థము తాను వివాహమాడక తనకాలమంతయు బ్రహ్మచర్య వ్రతమును బూనెద నని ప్రతిజ్ఞ బట్టెను. అంతట సత్యవతిని శంతనున కిచ్చి దాశ రాజు వివాహము చేసెను. పిమ్మట సత్యవతికిఁ జిత్రాంగదవిచిత్రవీర్యులను నిద్దరు పుత్త్రులు జన్మించిరి. తరువాత గొంత కాలమునకు శంతనుఁడు కాలధర్మ మొందెను. భీష్ముఁడు తాను బూనినప్రతిజ్ఞప్రకారము తనభిన్నోదరభ్రాతలలోఁ బెద్దవాఁ డగుచిత్రాంగదుని రాజ్యాభిషిక్తుం జేసిన నాతండును నతివ్యాలోలుండై గర్వంబున నెవ్వరి నుఱక సురదనుజమనుజగంధర్వాదుల నాక్షేపించుచున్న వాని కలిగి చిత్రాంగదుం డనుగంధర్వపతి యుద్ధార్థియై వచ్చి శంతనుపుత్త్రుని జిత్రాంగదు రణ ముఖమునఁ గూల్చెను.

తరువాత భీష్ముండు విచిత్రవీర్యునిఁ గౌరవరాజ్యమున కభిషిక్తుం జేసిన కొంతకాలమునకుఁ గాశిరాజుకూఁతులస్వయంవరోత్సవంబు విని ధనుర్ధరుండై రథం బెక్కి యొక్కరుండె వారణాసీపురంబునకుం జని యందు స్వయంవరంబునకు మూఁగినరాజలోకం బెల్ల వెఱచి వెఱగుపడి చూచు చుండ నక్కన్యకలఁ దనరథం బెక్కించుకొని యెల్లవారలు విన నిట్లనియె. "బ్రాహ్మంబు మొదలుగాఁ గలయెని మిది వివాహములయందు క్షత్త్రియులకు గాంధర్వరాక్షసంబు లుత్తమంబులు. స్వయం వరంబున జయించి వివాహంబగుట యంతకంటె నత్యుత్తమంబు గావున నిమ్మూఁగిన రాజలోకంబు నెల్ల నోడించి యిక్కన్యలం దోడ్కొనియె చనుట ధర్మంబు." అని కాశి రాజునకుం జెప్పి భీష్ముండు వచ్చునపుడు సాల్వుం డనురాజు భీష్ము నెదుర్కొని పరాజితుఁడై తనపురంబున కరిగె. పిమ్మట కాశిరాజుదుహితలం దోడ్కొని వచ్చి భీష్ముండు విచిత్రవీర్యునకు వివాహము సేయనున్న సమయంబునఁ బెద్దది యైనయంబ యనున్న సాల్వపతి వరియించినఁ దండ్రిచేఁ బూర్వదత్తనైతిని. ఇట ధర్మంబు విచారించి

కాళ్యాచరణంబు గావించునది." యనిన భీష్ముండు ధర్మవిదులైన బ్రాహ్మణుల యనుమతంబున దాని సాళ్వరాజున కిచ్చి పుచ్చి మహోత్సవంబున నయ్యిరువురు కన్యకల విచిత్రవీర్యునకు వివాహంబు చేసెను.

అనంతరము కొంతకాలమునకుఁ గాలవశంబున విచిత్రవీర్యుం డమరపురికిం జనిన సత్యవతి శోకార్ణవంబున మునింగియున్న తల్లిని, మఱఁదండ్రను నాశ్వాసించి రాజ్యం బకళంకంబుగా భీష్ముఁడు ప్రతిపాలించుచుండెను.

కురువంశ మంతరించిపోవుటకు సత్యవతి చింతించి భీష్మునితో "వివాహమాడి పుత్రసంతతిఁ బడసి వంశము నిలిపి రాజ్యపరిపాలనంబు సేయవలె" నని పలువిధములఁ బతిమాలుకొనెను గాని యట్లుచేయుట తాను పట్టిన ప్రతిజ్ఞకు భంగ మగుటంజేసి సమయస్థితిని విడువక యాకాలమందలి ధర్మశాస్త్రప్రకారము వంశమునిలుపు నాచారము తనసవతితల్లియగు సత్యవతితోఁ జెప్పి యామెను నొప్పించి తాను చేసిన ప్రతిజ్ఞను నిలుపుకొనెను.

నీతి — గాంగేయుఁడు తండ్రియడుగకయె తాను బ్రహ్మచర్యవ్రతము బూని తండ్రి వలచినసతిని దండ్రికిఁ దెచ్చి యిచ్చివివాహము చేయించెను. తండ్రిపోయినతరువాత భిన్నోదరుల నన్యథా చూడక వారికి రాజ్య మొసఁగెను. క్షత్రియోచితపద్ధతి ననుసరించి కాశిరాజకూఁతులఁ దెచ్చి విచిత్రవీర్యునకు వివాహము చేసెను. వారిలో పెద్దదగు నంబ సాళ్వరాజునకుఁ బూర్వదత్తయగుటం దెలిసి యామెను సాళ్వునొద్దకు బంపెను. విచిత్రవీర్యుఁడు నిస్సంతానుఁడై కాలధర్మ మొందినతర్వాతఁగూడ తన సాపత్న్యమాతచే వేఁడికొనఁబడినవాఁ డయ్యును దాను వివాహమాడుట కిష్టపడఁ డయ్యెను. బహుపరాక్రమశాలియై యౌవనవంతుఁడై యున్న భీష్మునివలె స్వార్థత్యాగి మఱియొకఁడు కానరాఁడు. ఇతని కితఁడేసాటి. లోకములో ధనకాములు స్త్రీకాములు నైనవారే పెక్కండ్రు కలరు. కాంతాకనకముల నెట్లైన సంగ్రహించుటకే లోకము చూచుచుండును. ఈతఁ డట్లుచేయఁడు. తాను కోరకయె సమయము వచ్చినను, దల్లిపలువిధముల బతిమాలుకొనినను వివాహమాడుట కిష్టపడఁడు. రాజ్యభారమున కంగీకరింపఁడు. తరువాత గొంతకాలమునకు భీష్మాదివీరులయెదుట సుయోధనుఁడు వాఁడిగలసూదిమొన మోపినంతయైన నేలను బంచి పాండుసుతుల కియ్యనని పట్టుపట్టి యెంద ఱెన్నిచెప్పినను వినక యతిలోభియై సర్వమునం గోలుపోయెను. భీష్ముని స్వార్థత్యాగమునకును, సుయోధనుని స్వార్థపరత్వమునకును వార మెంత యున్నదో పాఠకులు గ్రహింతురు గాక! భీష్మునిస్వార్థత్యాగమె యిందలి నీతి.

శంతనుండు సకలరాజన్యపరిధానసమక్షంబున గాంగేయునకు యౌవరాజ్యాభిషేకంబు సేసి కొడుకుతో డివినోదంబులం దగిలి నాలుగు వత్సరంబు లనన్యవ్యాపారుం డై యుండి యొక్కనాఁడు యమునాతీరం బున వేఁటాడుచు గ్రుమ్మరువాఁ డపూర్వసురభిగంధం బాఘ్రాణించి దానివచ్చినవల నారయుచు నరిగి యమునానదీతీరంబున.

యోజనగంధి.

క. కనకావదాతకోమల
తనులతఁ దనుమధ్యఁ గమలదళనేత్రను యో
జనగంధి నవనినాథుఁడు
గనియెను సురకన్యకోనికన్నియ నంతన్.

ఉ. దానిశరీరసౌరభము దానివిలోలవిలోకనంబులున్
దానిమనోహరాకృతియు దానిశుచిస్మితవక్త్రకాంతియున్
దానివిలాసముం గడుముదంబునఁ జూచి మనోజబాణసం
తానహతాత్ముఁ డై నృపతి దానికి ని ట్లనియెన్ ముదంబునన్.

ఉ. ఎందులదాన వేకతమ యియ్యమునానది నోడ సల్పుచున్
సుందరి నీవు నున్కి యిది చూడఁగఁ దా నుచితంబె నావుడున్
మందమనోజ్ఞహాసముఖమండల మెత్తి మృగాక్షి సూచి సం
క్రందనసన్నిభున్ నృపతిఁ గన్యక యిట్లని పల్కెఁ బ్రీతితోన్.

వ. ఏను దాశరాజుకూఁతురఁ దండ్రినియోగంబున నిక్కార్యంబు ధర్మా ర్థంబు సేయు చుండుదు ననిన దానియభినవరూపసౌందర్యంబులు దొల్లియువిని యెఱింగినవాఁ డై యక్కోమలిం గామించి దాశరాజు కడకుంజని తనయభిప్రాయం బెఱింగించిన నతండును సంతసిల్లి శంతను నత్యంతభక్తిం బూజించి యి ట్లనియె.

తే. పుట్టినప్పుడ కన్యకఁ బోలునట్టి
వరున కిచ్చుట యిది లోకవర్తనంబు

వసుమతీనాథ నీయట్టివరున కిచ్చి
ధన్యులము గామె యిక్కన్యఁ దద్ద పేర్మి.

వ. అయినను నాడెందంబునం గలదానిం జెప్పెద నిక్కన్యక నీకు ధర్మ
పత్నిఁగాఁ జేయునట్టియిష్టంబు గల దేని నావేఁడినదాని నిమ్మనిన
శంతనుండు దాని నీ నగునేని నిచ్చెదఁ గాని నాఁడీ నేర నది యేది
సెప్పు మనిన దాశరా జిట్లనియె.

మధ్యాక్కర. భూపాల నీకు నిక్కోమలివలనఁ బుట్టినసుతుఁడు
నీపరోక్షంబున రాజు గావలె నెమ్మి నిట్టీఁగ
నోపుదే యనిన శంతనుఁడు గాంగేయు యువరాజుఁ దలఁచి
యీపల్కు దక్కఁగ నొండు వేఁడుమ యిచ్చెద ననిన.

వ. నాకొండెద్దియు నిష్టంబు లే దనిన విని యద్దాశరాజుచేతం బ్రతి
హతమనోరథుం డయి క్రమ్మఱి వచ్చి శంతనుండు చింతాక్రాంతుం
డయి సత్యవతిన తలంచుచు వీతకార్యావసరుం డయి యున్న నొక్క
నాఁడు గాంగేయుండు దండ్రిపాలికి వచ్చి యి ట్లనియె.

చ. భవదభిరక్షితక్షితికి బాధ యొనర్పఁగ నోపునట్టిశా
త్రవనివహంబు లేదు వసుధాప్రజ కెల్ల ననంతసంతతో
త్సవముల రాజు లెల్ల ననిశంబు విధేయుల నీకు నిట్లు మా
నవవృషభేంద్ర యేలొకో మనఃపరితాపముఁ బొంది యుండఁగన్.

వ. అనిన విని పెద్దయుం బ్రొద్దు చింతించి శంతనుండు గొడుకున
కిట్లనియె.

క. వినవయ్య యేకపుత్త్రుఁడు
ననపత్యుఁడు నొక్కరూప యని ధర్మవులన్
విని నీకుఁ దోడు పుత్త్రుల
ననఘా పడయంగ నిష్ట మయినది నాకున్.

క. జనవినుత యగ్నిహోత్త్రం
బును సంతానమును వేదములు నెడ తెగఁగాఁ

జన దుత్తమవంశజులకు
ననిరి మహాధర్మనిపుణు లైన మునీంద్రుల్.

క. నీవస్త్రశస్త్రవిద్యా
కోవిదుఁడవు రణములందుఁ గ్రూరుఁడ వరివి
ద్రావణసాహసికుండవు
గావున నీయునికి నమ్మఁగా నోప నెడన్.

గాంగేయుఁడు.

వ. బహుపుత్త్రార్థంబు యత్నంబు సేయ వలయు వివాహం బయ్యెద ననిన విని గాంగేయుండు వృద్ధామాత్యపురోహితసుహృజ్జనంబులతో విచారించి యోజనగంధి రాజచిత్తంబునం గలుగుట యెఱింగి యనేకరాజన్యసమన్వితుం డయి దాశరాజుకడకుం జని యారాజునకు సత్యవతిని దేవిఁగా నిచ్చునది యని యడిగిన నాతండును దేవవ్రతుం బూజించి నీవు ధర్మశీలుండ వర్థానర్థవిదుండవు సకలకార్యసమర్థుండవు గుర్వర్థంబు గన్యార్థి వై వచ్చితివి కావునం గృతార్థుండ నైతి నెవ్వనివలనన నిక్కన్య యుద్భవిల్లె నట్టియుపరిచరుం డనురాజర్షి యీసత్యవతి నొరులకీ వలవదు శంతనునక యిచ్చునది యనుటం జేసి తొల్లి యసితుం డయిన దేవలుండు గన్యార్థి యయి వచ్చి ప్రత్యాఖ్యాతుం డయ్యె నిట్టిసంబంధ మెవ్వరికిం బడయ నగు.

క. విను మైనను సాపత్న్యం
బనుదోషము గలదు దీనినదియును నీచే
తన సంపాద్యము నీ వలి
గిన నష్టమె పురహరాజకేశవు లయినన్.

వ. ఆదోషం బెట్లు పరిహృతం బగు నట్లుగా నీచిత్తంబునం దలంచి వివాహంబు సేయు మనిన గాంగేయుం డిట్లనియె.

### భీష్ముఁడు బ్రహ్మచర్యవ్రతంబుఁ బూనుట.

చ. వినుఁడు ప్రసిద్ధులైన పృథివీపతు లందఱు నే గురుప్రయో
జనమునఁ జేసితిన్ సమయసంస్థితి యీలలితాంగి కుద్భవిం
చినతనయుండు రాజ్యమును జేయఁగ నర్హుఁడు వాఁడ మాకున
ల్లను బతి వాఁడ కౌరవకులస్థితికారుఁ డుదారసంపదన్.

వ. అని సభాసదుల కెల్ల మహాహర్షంబుగా సత్యవ్రతుం డయిన దేవ
వ్రతుండు పలికిన వెండియు దాశరా జిట్లనియె,

క. నీ వఖిలధర్మవిదుఁడవు
గావున నీ కిట్లు చేయఁగా దొరకొనియెఁ గా
భావిభవత్సుతు లిట్టిరె
నీవిహితస్థితియు నలుపనేర్తురె యనినన్.

క. ధృతిఁ బూని బ్రహ్మచర్య
వ్రత మున్నతిఁ దాల్చితిని ధ్రువంబుగ ననప
త్యత నైనను లోకము లా
యతిఁ బెక్కులు గలవు నాకు ననుభావ్యములై.

వ. అని యిట్లు సత్యవతిం దనతండ్రికి వివాహంబు సేయుపొంటె నిజ
రాజ్యపరిత్యాగంబును బ్రహ్మచర్యవ్రతపరిగ్రహంబునుం జేసిన దేవ
వ్రతు సత్యవ్రతంబునకు గురుకార్యధురంధరత్వంబునకు మెచ్చి దేవర్షి
గణంబులు నాతనిపయిం బుష్పవృష్టిఁ గురిసి భీష్ముం డని పొగడిరి.
దాశరాజును గరంబు సంతసిల్లి శంతనునకు సత్యవతి నిచ్చె నంత.

మ. ఇనతేజుం డతిభక్తిఁ గాంచనరథం బెక్కించి యక్కన్యఁ దో
డ్కొని తెచ్చెం దనతల్లి సత్యవతినిన్ క్షోణీజనుల్ దన్ను బో
రనఁ గీర్తింపఁగ శంతనుం డతిమనోరాగంబునం బొంద శాం
తనవుం డాతతకీర్తి హస్తిపురికిం దత్కౌతుకారంభుఁడై.

వ. శంతనుండును పరమానురాగంబున సత్యవతిని వివాహంబై యతి
మానుషం బయినయాభీష్మసత్యవ్రతంబునకు సంతసిల్లి యాతని

స్వచ్ఛందమరణంబుగా వరం బిచ్చి సత్యవతియందుఁ జిత్రాంగద
విచిత్రవీర్యు లన నిద్దఱు గొడుకులం బడసి వారలు సంప్రాప్తయౌవ
నులు గాకుండఁ బరలోకగతుం డైనఁ దండ్రికి భీష్ముండు పరలోక
క్రియలు నిర్వర్తించి చిత్రాంగదు రాజ్యాభిషిక్తుం జేసిన నాతండును
నతివ్యాలోలుండై గర్వంబున నెవ్వరి నుఱక సురదనుజమనుజగంధ
ర్వాదుల నాక్షేపించు చున్న వాని కలిగి చిత్రాంగదుం డనుగంధర్వ
పతి యుద్ధార్థి యయి వచ్చినం గురుక్షేత్రంబునందు.

క. నరగంధర్వాధిపు ల
య్యిరువురు చిత్రాంగదులు సహింపక యని నాఁ
బోరుఁ దాఁకి పోరఁ బొడిచిరి
హిరణ్వతీతీరమున నహీనబలాఢ్యుల్.

క. వదలక మా మూఁయుద్ధా
తిదక్షుఁ డయి పంచనోన్నతిన్ గంధర్వుం
డుదితరవితేజుఁ జిత్రాం
గదుఁ జంపె విచిత్రపత్త్రికార్ముకహస్తున్.

విచిత్రవీర్యుఁడు.

వ. ఇట్లు చిత్రాంగదుండు గంధర్వనిహతుం డైనం దత్పరోక్షంబున
భీష్ముండు విచిత్రవీర్యుం గౌరవరాజ్యంబున కభిషిక్తుం జేసెం.

క. వసునిభుఁడు పైతృకం బగు
వసుధారాజ్యంబు భీష్మవచనమున గత
వ్యసనుఁ డయి తాల్చెఁ దేజం
బెసఁగంగ విచిత్రవీర్యుఁ డిద్ధయశుం డై.

వ. అట్టివిచిత్రవీర్యు నారూఢయౌవనుం జూచి భీష్ముండు వివాహ
యత్నపరుం డయి తనచారులవలనం గాశీరాజుకూఁతులస్వయంవరో
త్సవంబు విని ధనుర్ధరుం డయి రథం బెక్కి యొక్కరుండ వారణాసీ

పురంబునకుం జని యందు స్వయంవరంబునకు మూఁగినరాజలోకం
బెల్ల వెఱచి వెఱఁగుపడి చూచుచుండ నక్కన్యకలఁ దనరథం
బెక్కించికొని యెల్లవారలు విన నిట్లనియె.

క. నాయనుజునకు వివాహము
సేయఁగఁ గన్యాత్రయంబుఁ జేకొని బలిమిం
బోయెద నడ్డం బగువా
రాయతభుజశక్తి నడ్డ మగుఁ డాజిమొనన్.

వ. బ్రాహ్మంబు మొదలుగాఁ గలయెనిమిదివివాహంబులయందు క్షత్రియులకు గాంధర్వరాక్షసంబు లుత్తమంబులు స్వయంవరంబున జయించి వివాహం బగుట యంతకంటె సత్యుత్తమంబు గావున నిమ్మూఁగినరాజలోకంబు నెల్ల నోడించి యిక్కన్యలం దోడ్కొని నాచనుట యిది ధర్మంబ యని కాశీరాజునకుం జెప్పి వీడ్కొని భీష్ముండు వచ్చునప్పుడు.

మ. నరనాగాశ్వవరూథయూథములతో నానావనీనాథు లు
ద్ధురులై యొక్కట నొండొరుం జఱచి యుత్తుంగానిలోద్ధూతసా
గరసంక్షోభసమంబుగాఁ గలఁగి వీఁకన్ వీరులై తాఁకి రే
సిరి దేవవ్రతుపై నభోవలయ మచ్ఛిద్రంబు గా నమ్ములన్.

క. వారల నందఱ రౌద్రా
కారుండై కసిమసంగి గాంగేయుఁడు దు
ర్వారపటుబాణనిహతిని
వీరాహవరంగమునకు విముఖులఁ జేసెన్.

క. నెఱి నుఱక వైరివీరుల
నెఱఁకులు దూఱంగ నేయునృపపుంగవుసం
పఱ కోర్వక పిఱుసని రని
వెఱచి విషణ్ణులయి సకలవిషయాధిపతుల్.

వ. ఇట్లు నిఖిలక్షత్రియక్షయార్థం బలిగినపరశురాముండునుం బోలెఁ గడు నలిగి పరశురామశిష్యుం డాక్షత్త్రివర్గంబు నెల్లఁ దనశరవర్షంబున ముంచి యోడించి యేకవీరుం డయి వచ్చువానిసీటుంద సమరసన్నద్ధుం డయి సాల్వుండు సనుదెంచి.

భీష్మునితో సాల్వుఁడు యుద్ధంబు సేయుట.

ఉ. ఈవసుధాధినాథుల జయించినయట్టిద కాదు సక్కనై పోవక నిల్వు నా కెదిరి పోర మదీయధనుర్విముక్తనానావిధమార్గణోగ్రగహనంబున దిగ్భ్రమఁ బొంద కెమ్మెయిం బోవఁగఁ బోలు నీ కనుచుఁ బూరుకులోత్తముఁ దాఁకె పీఁకతోన్.

వ. భీష్ముండును తనరథంబు నివర్తింపించి సంవర్తసమయసమవర్తియుం బోలెరౌద్రాకారుం డయి నిలిచిన.

చ. అనిలజవంబునం బఱచునమ్మదనాగ మెదిర్చి క్రమ్మఱిం చినపరికాఁడపోలెఁ గురుసింహవరూథము నిట్లు గ్రమ్మఱిం చునె యిఁకఁ డంచునుం దగిలి చూపఱు సాల్వమహీశువిక్రమం బొనరఁగ నల్లడం గగడుచుండిరి విస్మయసక్తచిత్తులై.

వ. అంత.

క. ధృతిమెయి శతసంఖ్యయు దశ
శతసంఖ్యయు శతసహస్రసంఖ్యయు ను శతా
యుతసంఖ్యయుఁ గా దేవ
వ్రతుమీఁదను సాల్వుఁ డేసె వాఁడిశరంబుల్.

క. ఘనభుజుఁ డన్నియు నడుమన
తునియఁగ వడి నేసి వానితురగచయస్యం
దనసూతుల నొక్కొక య
మ్మునఁ ద్రెళ్ళఁగ నేసె భరతముఖ్యుఁడు పోరన్.

క. రథమును రథ్యంబులు సా
రథియును వృథ యైన భగ్నరథుఁ డై భాగీ

రథికోడుకుచేత విమనో
రథుఁడై సాల్వుండు నిజపురంబున కరిగెన్.

వ. ఇట్లు సకలరాజలోకంబు నెల్ల నశ్రమంబున నోడించి సాల్వరాజు మందలవిడిచి పరాక్రమలబ్ధ లయినకాశీరాజదుహితలం దోడ్కొని వచ్చి భీష్ముండు విచిత్రవీర్యునకు వివాహంబు సేయ నున్న నందుఁ బెద్దది యైనయంబ యిట్లనియె.

ఆ. పరఁగ నన్ను సాల్వపతి వరియించినఁ
దండ్రిచేతఁ బూర్వదత్త నైతి
నన్యమహీశునకు నయంబున నెయ్యది
ధర్మ మెఱిఁగి దానిఁ దలఁపు మిపుడు.

వ. అనిన విని భీష్ముండు ధర్మవిదు లయినబ్రాహ్మణులయనుమతంబున దాని సాల్వరాజున కిచ్చి పుచ్చి మహోత్సవంబున నయ్యిరువురు కన్యకల విచిత్రవీర్యునకు వివాహంబు సేసిన

ఉ. లాలితరూపయౌవనవిలాసవిభాసిను లైనయంబికాం
బాలికలన్ వివాహ మయి భారతవంశకరుండు గామలీ
లాలలితానుభోగరసలాలసుఁడై నిజరాజ్యభారచిం
తాలసుఁ డయ్యెఁ గామికి నయంబున నొండు దలంపఁబోలునే!

వ. ఇట్లు సకలవ్యాపారరహితుండై కాశీరాజదుహితల నయ్యిరువుర నతిప్రణయగౌరవంబునం దగిలి.

సీ. అమలసుధారమ్య హర్మ్యతలంబుల
నవకుసుమామోదనందనములఁ
గృతకాద్రికందర క్రీడాగృహాంగణ
వివిధరత్నోజ్జ్వలవేదికలను
గలహంసకలనాదకమనీయకమలినీ
దీర్ఘికాసైకతతీరములను

రమియించుచును గామరాగాధికాసక్తిఁ
జేసి శోషించి విచిత్రవీర్యుఁ
ఆ. డమరపురికిఁ జనిన సతనికిఁ బరలోక
విధుల శాస్త్రదృష్టి వెలయఁ జేసె
నాపగాత నూజుఁ డఖిలబాంధవులయు
బ్రాహ్మణులయుఁ దోడ భానునిభుఁడు.

వ. మఱియు నత్యంతశోకార్ణవంబున మునింగిన తల్లిని మాఱుఁదండ్రను నాశ్వాసించి యరాజకం బయినరాజ్యం బకళంకంబుగాఁ బ్రతిపాలించు చున్నకొడుకు నఖిలధర్మవిదు గాంగేయుం జూచి సత్యవతి యిట్లనియె.

క. శంతను సంతానంబును
సంతతకీర్తియును బిండసంస్కృతియును స
త్యంతమహాభారమును బ
రంతప నీయంద చిరతరం బై నిలిచెన్.

చ. జననుత సర్వధర్మవులు సర్వజగత్పరివర్తనక్రమం
బును మఱి సర్వవంశములు బుట్టినమార్గము నీవ నిక్కవం
బనఘ యెఱుంగు దున్నతగుణాఢ్యుఁడవున్ భరతాన్వయావలం
బనుఁడవు నీవ నిన్నొకఁడు పంచెదఁ జేయుము మత్ప్రియంబుగన్.

క. ఇక్ష్వాకువంశంబున నీ
వొక్కరుఁడవ యున్నవాఁడ పుర్వీరాజ్యం
బెక్కటి సేకొని తేజము
దిక్కుల వెలిఁగింపు సంతతియుఁ బడయు మొగిన్.

క. నిరతంబు బ్రహ్మ మొదలుగ
వరుసన యెడ తెగక యిట్లు వచ్చినవంశం

బురుభుజ నీ వుండగఁ నీ
తరమున విచ్ఛిన్న మగుట ధర్మమె యనినన్.

క. విని భీష్ముఁ డనియె మీ కి
ట్లని యానతి యీయఁ దగునె యమ్మెయి నాప
ల్కినపల్కును మఱి నాతా
ల్చినవ్రతమును జెఱుప నంతచిఱుతనె చెపుమా.

క. హిమకరుఁడు శైత్యమును స
ర్యముఁడు మహాతేజమును హుతాశనుఁ డుష్ణ
త్వము విడిచిరేని గుర్వ
ర్థము నాచేకొనినసద్వ్రతంబు విడుతునే.

వ. పృథివ్యాదిమహాభూతంబులు గంధాదిగుణంబుల నెట్లు విడువ వట్ల యేనును గురుకార్యంబున మీకులార్థంబుగా సర్వజనసమక్షంబున నాచేసినసమయస్థితి విడువ నది యట్లుండె మీయానతిచ్చినట్లు నా యెఱుంగనిధర్మవులు లేవు శంతనుసంతానంబు శాశ్వతం బగు నట్లుగా క్షత్రధర్మంబు సెప్పెద నాచెప్పినదాని ధర్మార్థవిదు లయి లోకయాత్రానిపుణు లయినపురోహితప్రముఖనిఖిలబ్రాహ్మణవరు లతో విచారించి చేయునది యని భీష్ముం డండఱు విన నిట్లనియె.

చ. పితృవధజాతకోపపరిపీడితుఁ డై జమదగ్నిసూనుఁ డు
ద్ధతబలు హైహయున్ సమరదర్పితుఁ జంపి యశేషధారుణీ
పతులను జంపె గర్భగతబాలురు నాదిగ నట్టిచోటఁ ద
త్సతులకుఁ దొల్లి ధర్మవిధి సంతతి నిల్పిరె భూసురోత్తముల్.

---

ద్రోణుఁ డస్త్రవిద్యం దనశిష్యులఁ బరీక్షించుట.

---

కథ.

గురుశుశ్రూషచేసి తాను విద్యాలాభమును బొందఁగోరునపుడు శ్రద్ధాభక్తులావశ్యకములు. తాను గ్రహించినవిద్య గురువుచేఁ బరీక్షింపఁబడునపు డితరచింతలు

మూని యేకాగ్రత నున్నంగాని కృతార్థుఁడు కాఁజాలఁడు. కావున విద్యార్థు లెల్లరును దా మభ్యసింపఁ గోరువిద్యలను శ్రద్ధతో నభ్యసించి విద్యాపరిశీలనాసమయమునందుఁ దా మాచరింపవలసినవిధుల నుం డితరచింతలు లేనినిర్మలమైనబుద్ధితో వర్తింపని యెడలఁ దా మెన్నఁడును గృతార్థులు కానేరరు.

నీతి — తా మభ్యసించుసమయములయందును బరీక్షాసమయములందును మిక్కిలి శ్రద్ధతో నుండవలయును. అర్జునుఁడు శస్త్రవిద్యలఁ బరీక్షింపఁబడునపుడు తనబుద్ధి నంతయు లక్ష్యమందె యుంచుటచేసి గురుఁడైనద్రోణునిసన్నిధిని గౌరవపాండవులలో నొక్కఁడె కృతార్థుఁ డయ్యెనుగదా!

వ. అక్కుమారులధనుర్విద్యాకౌశలం బెఱుంగ వేఁడి యొకనాఁడు ద్రోణుండు గృత్రిమం బయినభాసం బను నొకపక్షి వృక్షశాఖాగ్రంబున లక్ష్యంబుగా రచియించి దాని నందఱకుం జూపి మీమీ ధనువుల బాణంబులు సంధించి నాపంచినయప్పుడ యప్పక్షితలం దెగ నేయుం డే నొక్కొక్కళ్ళం బంచెద నని ముందర ధర్మనందనుం బిలిచి యీవృక్షశాఖాగ్రంబున నున్నపక్షి నిమ్ముగా నీక్షించి మద్వచనానంతరంబున శరమోక్షంబు సేయు మనిన నతఁడును వల్లె యని గురువచనంబు సేసి యున్నయయ్యుధిష్ఠిరునకు ద్రోణుం డిట్లనియె.

తే. వృక్షశాఖాగ్రమున నున్నపక్షిశిరముఁ
దెల్లముగఁ జూచితే మహీవల్లభుండ
యనిన నిమ్ముగఁ జూచితి ననిన వెండి
యును గురుఁడు ధర్మజున కిట్టులనియెఁ బ్రీతి.

క. జననుత యీమాత్రిని న
న్నును మఱి నీభ్రాతృవరులనుం జూచితె నీ
వనవుడుఁ జూచితి నన్నిఁటి
ననఘా వృక్షమున నున్నయవిహగముతోన్.

వ. అనిన విని ద్రోణుండు ధర్మజుం బదరి నీదృష్టి చెదరె నీవు దీని నేయ నోపవు పొమ్ము మని యివ్విధంబున దుర్యోధనాదు లైన

ధార్తరాష్ట్రులను భీమసేననకులసహదేవులను నానాదేశాగతులయిన రాజపుత్రులను గ్రమంబున నడిగిన వారలు ధర్మనందను చెప్పినట్లు చెప్పిన నందఱ నిందించి పురందరనందనుం బిలిచి వారి నడిగినయట్ల యడిగిన నాచార్యులకు నర్జునుం డిట్లనియె.

క. పక్షిశిరంబు దిరంబుగ
నీక్షించితి నొండు గాన నెద్దియు ననిశన్
లక్షించి యేయు మని సూ
క్ష్మేక్షుఁడు ద్రోణుండు పనిచె నింద్రతనూజున్.

క. గురువచనానంతరమున
నరుఁ డప్పుడు శరవిమోక్షణము సేయుడుఁ జె
చ్చెరఁ బక్షిశిరము తెగి త
ద్ధరణీరుహశాఖనుండి ధారుణిఁ బడియెన్.

వ. ఇట్లు క్రమంబునఁ గృత్రిమపక్షితలఁ దెగ నేసినయర్జునునచలిత దృష్టికి లక్ష్యవేధిత్వంబునకు మెచ్చి ద్రోణుం డాతనికి ధనుర్వేద రహస్యంబు లుపదేశించె నంత.

క. మానుగ రాజకుమారుల
తో నొక్కట నొక్కనాఁడు ద్రోణుఁడు గంగా
స్నానార్థ మరిగి యందు మ
హానియమస్థుఁ డయి నీళ్లు లాఁకుచు నున్నన్.

క. వెఱచఱవ నీరిలో నొ
క్కఱగా నొకమొసలి సూక్ష్మకి నగోచరమై
పఱతెంచి కుంభసంభవు
చిఱుదొడ పడిఁ బట్టికొనియె శిష్యులు బెదరన్.

క. దాని విడిపింప ద్రోణుఁడు
దా నపుడు సమర్థుఁ డయ్యుఁ దడయక పనిచెన్

దీని విడిపింపుఁ డని నృప
సూనుల శరసజ్యచాపశోభితకరులన్.

శా. దానిన్ నేరక యందఱున్ వివశులై తారున్న నన్నీరిలోఁ
గానం గానిశరీరముం గలమహోగ్రగ్రాహమున్ గోత్రభి
త్సూనుం డేనుశరంబులన్ విపులతేజుం డేచి శక్తిన్ మహో
త్సేనప్రఖ్యుఁడు ద్రోణుజంఘ విడిపించెన్ విక్రమం బొప్పఁగన్.

వ. అమ్మహోగ్రగ్రాహంబు పార్థబాణపంచకవిభిన్నదేహంబయి పంచత్వంబుఁ బొందినం జూచి ద్రోణుం డర్జునుధనుఃకౌశలంబునకుఁ దనయం దతిస్నేహంబునకు మెచ్చి వీనిచే ద్రుపదుండు బంధుసహితంబు పరాజితుం డగు నని తనమనంబున సంతోషించి వానికి ననేక దివ్యబాణంబు లిచ్చె.

---

## ధర్మవ్యాధుఁడు.

---

### కథ.

మార్కండేయుఁడు ధర్మరాజున కరణ్యవాసమునం దీకథను జెప్పెను.

తా నెంతయధికుఁడైనను బరులను వెలితిపరిసంగములచే నిరాకరింపఁగూడదు. కావునఁ దనకులాచారధర్మములు, తా నాచరింపవలసిన విధివిహితమైననియమములు, తత్తత్కాలానుసారముగ జరుపవలయును. తనకు నియతమైనధర్మములను జరుపక యధికధర్మముల నాచరించుటకు యత్నించి తనయతిశయమును నితరులకు బయలు పఱుపఁగోరు మనుజుఁడు ఫలహీనుఁడై చెడును. ఇందులకుఁ గౌశికుఁ డనుబ్రాహ్మణుని కథయె తార్కాణము.

పూర్వకాలమునఁ గౌశికుఁ డనునొకవిప్రుఁడు వేదాధ్యయనసంపన్నుఁడై చెట్టునీడను దప మాచరించుచుండఁ బైనుండి యొకకొక్కెర రెట్టవేయ మాదు వట్టునఁ బడెను. అప్పు డావిప్రుఁడు తీవ్రమైనయలుక పొడమి యుపరితలంబునఁ బరీక్షింప నొకకొక్కెర కానంబడియె. అప్పు డపకృతి యొనర్చిన యాకొంగ యుగ్రమునిదృష్టిఁ గలతపోగ్నివేఁడిమిచే భస్మమై నశించెను. అంతట వేదవిదుఁడు కొక్కెర మృతియగుటం గని చింతించి కొంతవడికి భిక్షాటనంబునకుం జనుదెంచి

యొక్క విప్రుగృహముజేరి "భవతిభిక్షాందేహి" యని కేక వైచెను. లోన నున్నయొక గుణవతియగుపతివ్రత భర్తృశుశ్రూషాపరవశురాలై యుంటచేత నతిథిసత్కారము చేయుట కవకాశము చిక్కక పతికిఁజేయుపరిచర్య సమాప్తముచేసి భిక్షఁ గొని చనుదెంచిన నమ్మునివరుం జూచి కౌశికుండు కోపరంజితనయనుం డగుచు "వచ్చినవెంటనే నాకు భిక్షముపెట్టి పంపక యేలయాలస్యము చేసితి" వని పలికెను. అందుల కామె తనభర్త యాఁకలిగొని వచ్చియుండుటంజేసి యాయనకు సపర్యలు సేయుచుండుటవల్ల నింతయాలస్య మయ్యె నని చెప్పెను. అందుల కాబ్రాహ్మణుం డలిగి బ్రాహ్మణులపై నింత నిరాదరణ మేల యని బ్రాహ్మణమాహాత్మ్యమును బొగడుచు నామెనుగోపించి చూచెను. అందులకామె సద్వచనంబుల బ్రాహ్మణమాహాత్మ్య మెఱుంగుదునని పతివ్రతాధర్మంబులుం జెప్పి యాబ్రాహ్మణుండు కొక్కెరను జంపినవిషయమును బతివ్రతామాహాత్మ్యమునం గాంచితి నని యెఱుఁగఁబలికి, "నీ వతిక్రోధుండవుగావున బ్రాహ్మణుఁడవయ్యు నింకను దెలిసికొనవలసినధర్మము లనేకము లున్నవి. నీవు కేవలస్వాధ్యాయపరుండవు గాని, ధర్మసూక్ష్మత నెఱుంగవు కావున తడయక మిథిలానగరంబున కరిగి యందు జితేంద్రియుండును సత్యవాదియు మాతాపితృభక్తుండును నైయుండుధర్మవ్యాధుండనుకిరాతునివలన నీవు సకలధర్మంబులు నెఱింగి వ్యపగతసంశయుండవు గమ్ము" అని చెప్పి పంపెను. ఆబ్రాహ్మణుం డామె యొద్ద సెలవుగైకొని మిథిలానగరంబునందున్న ధర్మవ్యాధునొద్దకుఁబోయి వానివలన సమస్తధర్మములం దెలిసికొని కృతకృత్యుఁడయ్యెను.

నీతి:— తనకుఁగల విధివిహితమైన ధర్మముల నావశ్యకముగాఁ జరుపుకొనవలయును. అందు పితృమాతృపూజావిధానము మొదటిది. తక్కిన వ్యావహారిక కాలోచితధర్మములన్నియుఁ దత్తత్కాలానుసారముగా జరుపవగును. ధర్మము తప్పి సంచరించినయెడల బలహీనుఁడగుటయే గాక ప్రజానిందితుఁడును నగును. ఇందగ్రవర్ణుండయిన బ్రాహ్మణునికంటె నధమవర్ణుఁడయిన వ్యాధుండు ధర్మమార్గసంచారి యగుటఁ జేసి యధికుఁడయ్యెను. ఎక్కువతక్కువ లాచరణమునుబట్టియుండును గాని జాతిమతభేదములవలనఁ గలుగనేరవు.

కౌశికుం డను బ్రాహ్మణుండు ధర్మతపస్వియుండు సంతతాధ్యయనతత్పరుండయి యొక్కశిష్టగ్రామంబున నుండునతం డొక్కనాఁడు గ్రామసమీపంబునం దొక్కవృక్షమూలంబున నాసీనుండై వేదంబులు గుణించుచుండం దదీయశాఖాగతం బైన కొక్కెర యొక్కం

దాతనిపై రెట్ట వెట్టిన నమ్మహాద్విజుం డలిగి చూచుటయు నదియప్పుడ నిశ్చేతనం బై నేలం బడినం గనుంగొని యతండు.

క. అక్కట నాహృదయము గడు
నక్కటికము లేనిదయ్యె ననిమిత్తమ యీ
కొక్కెర నిటు సేసితి నా
కెక్కడిశాంతి యని వికలహృదయుం డగుచున్.

వ. పెక్కుభంగుల వగచి మధ్యాహ్నం బగుటయుఁ గృతాహ్నికవిధానుం డై గ్రామంబున కరిగి యందు శుచు లైనవిప్రగృహంబుల కరిగి భిక్షాచరణంబు సేయుచు నం దొక్కపుణ్యగృహంబువాకిట నిలిచి భిక్షాం దేహి యనుటయు నాయింటియవ్వయు నతిసంభ్రమంబున భిక్ష యిడుటకుం బాత్రశోధనంబు సేయునెడ.

ఉ. ఆయెలనాగభర్త గడు నాఁకటఁ గూలుచు వచ్చి వచ్చినం
దోయజనేత్ర సంభ్రమమునం దగుపీఁటయు వెట్టి పాద్యముం
బాయక మజ్జనక్రియయు భక్తి నొనర్చి ప్రియోక్తు లొప్పఁగా
నాయమ ప్రీతిఁ జేసి రుచిరాన్నరసంబులు నించి చెచ్చెరన్.

చ. కుడిచినసిమ్మటం గుసుమకోమలి విస్తృతసంస్తరంబుగా
నొడికపుసెజ్జ సేసి ప్రియుఁ డొయ్యన నందు శయింపఁ దమ్ములం
బిడి చరణంబు లొత్తి మది రేఁగిన యంతటిలోఁ దలంచె ము
న్నడుగఁగ భిక్షకై నిలిచినట్టిమహీసురముఖ్యు నాత్మలోన్.

వ. ఇట్లు దలంచి భిక్ష గొనుచుం జనుదెంచిన నమ్మగువం జూచి కౌశికుండు రోషరంజితలోచనుం డగుచు నిట్లనియె.

క. అడిగినయప్పుడ చెచ్చెరఁ
గడపినఁ బో నవ్వ మౌను గడుదుర్మతి వై
పడతి నను నిలిపి భిక్షం
బిడక కడు నవజ్ఞ సేసి తేల మదమునన్.

చ. అనినఁ బతివ్రతాతిలక మాతని కిట్లను నయ్య మత్ప్రియుం
డనుపమితక్షుధాచలితుఁడై చనుదెంచిన భక్తి నమ్మహా
త్మునకు సపర్య సేయుచు మిముల్ మదిలోనఁ దలంపఁ జాలనై
తి నిదియుం దప్పుగాఁ గొనక ధీరత యొప్ప సహింపఁగాఁ దగున్.

వ. అనిన నమ్మహీదేవుం డప్పతివ్రత కిట్లనియె.

ఉ. నీమగఁ డంత యెక్కుడె మహీసురులు భూసురు లింతతక్కువే
కోమలి యేల యిట్లు గడుఁ గ్రొవ్వునఁ గానవు లోకవంద్యులన్
భూమిసురేంద్రులన్ దివిజపూజ్యులఁ దాదిగ భక్తిఁ గొల్చుచో
నేమిట నొక్కవారు గడు నెల్లిదమైరిటు నీకు నిచ్చటన్.

క. అవమానితులై ధరణీ
దివిజులు క్రోధాగ్నిశిఖలఁ దీపించి మహా
ద్రివనసద్వీపంబులతో
నవని నయుసఁ బొడ వడంతు రప్రతికారుల్.

వ. నీ విం తెఱుంగ నొల్లనైతివి గాకేమి యనిన నయ్యంగన యిట్లనియె.

సీ. దేవతాసములు భూదేవతావరు లయ్య
యేను దన్మాహాత్మ్య మెఱుఁగనయ్య
యొకవిప్రుఁ డలిగి పయోనిధిజలము ల
పేయముల్ గాఁగ శపింపఁ డెట్లు
దండకవిషయంబు దగ్ధంబు సేయండె
యలుకమై నొక్కమహాద్విజుండు
వాతాపి యనుదైత్యవరు మ్రింగి యఱిగించు
కొనఁడె భూదేవుఁ డొక్కరుఁడు గినిసి

తే. ధరణి మఱియును బెక్కువిధంబులందు
బ్రహ్మవిదులైన బ్రాహ్మణప్రభులమహిమ

వినమొ యెఱిఁగియెఱింగి సద్వినుతచరిత
కొంగ యవిగాని వెత్తినే తల గ్రోఁకికొనఁగ.

వ. నా తెఱంగు సెప్పెద నాకర్ణింపుము.

తే. పతియ చూవె నాపాలికిఁ బరమదైవ
మేను వాఙ్మనఃక్రియలఁ దద్ధితము యెపుడుఁ
గోరి యొనరింతు దీని మిగులఁగ నొండు
ధర్మవులు గాన నెంతయు దలఁచి చూచి.

వ. నీ వతిక్రోధనుండ వగుటయు నెఱింగుదు నీకోపంబున నొక్క కొక్కెర నిహతం బయ్యెంగాదె యిది మదీయపాతివ్రత్యమహిమం జేసి కాంచితిం గాన క్రోధంబు గొనిపోవుట లెస్స గాదని యిట్లనియె.

తే. క్రోధమోహనామకు లైనఘోరశత్రు
లిరువు రేఁయించుచుండుదు రెపుడు నంత
రంగ మయ్యుభయంబు నడంగకున్నఁ
గలదె యూరక బ్రాహ్మణ్యగౌరవంబు.

సీ. ఎవ్వఁడు సత్యంబు నెప్పుడుఁ బల్కు - హిం
సావిదూరుఁడు గురుజనహితార్థి
యింద్రియంబుల నొక్కి యెల్లవారలఁ దన
యట్ల కాఁ జూచు ధర్మాభిరతుఁడు
గామంబు దగులండు కర్మంబు లాఱును
సముచితసంప్రయోజ్యతఁ జేసుర్ప
నట్టిపుణ్యాత్ముని ననఘు బ్రాహ్మణుఁ డని
యనిశంబుఁ గీర్తింతు రమరవర్యు

ఆ. లార్జవంబు శమము లధ్యయనంబును
బరమధనము సువ్వె బ్రాహ్మణునకు

ధర్మగతికి నవియ తగుసాధనంబులు
వేదవిహితముఖ్యవిధులు వినుము.

వ. ధర్మంబు బహుమార్గదృష్టం బయి సూక్ష్మం బయి యుండు నీవు కేవలస్వాధ్యాయపరుండవు గాని, ధర్మసూక్ష్మత యెఱుంగవుగావున నడయక మిథిలానగరంబున కరుగు మందు నితేంద్రియుండును సత్యవాదియు మాతాపితృభక్తుండును నయినవాఁడు ధర్మవ్యాధుం డను కిరాతుండు నీకు సకలధర్మంబులు నెఱింగించి సంశయచ్ఛేదంబు సేయు నాఁడెనం బ్రసన్నుండ వగునది. వనితలకుం బరిజ్ఞానంబు లేదు. గావున వా రెట్టియపరాధంబు సేసినను సహింప వలయుఁ గదా యనినఁ గౌశికుం డిట్లనియె.

క. నను దూఱం దగు నీకత
మున నాచిత్తము పవిత్రాంతిఁ గొనసెఁ బుణ్యంధ్రీ
జనవినుత పోయి వచ్చెద
ననుపమశోభనసమృద్ధ లయ్యెడు నీకున్.

కౌశికుం డను బ్రాహ్మణుఁడు ధర్మవ్యాధునియొద్దకుఁ బోవుట.

వ. అని యాకర్ణించి యమ్మహాద్విజుండు ధర్మవ్యాధదర్శనలాలసుండై కదలి పతివ్రత యెఱుకకు విస్మయం బందుచుఁ దన్నుం గృతాపరాధునిం గాఁ దలంచుచు ననేకనగరగ్రామంబు లతిక్రమించి చని యనుపమానశోభాసనాథం బయినమిథిలానగరంబు సొచ్చి రాజమార్గంబు దఱిసి యచ్చటిజనంబుల ధర్మవ్యాధుం డున్నయెడ నడిగి వా రెఱింగింప నట యేఁగి ముందట నల్పమృగమాంసఖండంబు లంగడిం బచరించి యమ్ము చున్నవాని ననవరతవిక్రయాగతజనసమావృతు నక్కిరాతుం గని యతిజుగుప్సితం బయినసూనాపణంబు సేర నొల్లక తొలంగి యొక్కయెడ నుండె నంత.

ఆ. వాఁడు నతనిరాక పోఁడిగ నిజబుద్ధి
నెఱిఁగి యతనియున్నయెడకు వచ్చి

పరమభక్తిఁ గ్రొమ్మొక్కి ధరణీసురేశ్వరుఁ
గుశల మడిగి ప్రియము గొనలునిగుడ.

చ. అనఘ నితంబినీతిలక మైనపతివ్రత నాతెఱంగు సె
ప్పినఁ జనుదెంచి తీవు ననుఁ బ్రీతిఁ గనుంగొన నీమనోరథం
బును మదిలోఁ దెలుంగుదుఁ బ్రమోదముఁ బొందితి రమ్ము మద్గృహం
బున కని పల్కి తోడుకొనిపోయె నతండు మహీసురోత్తమున్.

వ. కౌశికుండును ధర్మవ్యాధునెఱుక కచ్చెరువంది పతివ్రతయెఱుకయుం
దలంచి యిది రెండవపునాశ్చర్యంబు గంటి పొమ్మని తలంచుచుఁ
దదీయభవనంబున కరిగి వానిచేతం బూజితుం డయి యిష్టకథా
ప్రసంగంబుల నుండి యతని కిట్లనియె.

తే. నీవు గడుధర్మవిదుఁడవు జీవహింస
జీవనంబుగ నడచుట శిష్టపథమె
యకట యీఘోరకర్మంబులకు మనసు
బుద్ధి దద్దయు దుఃఖంబు వొందెద నిపుడు.

వ. అనుటయు లుబ్ధకుం డిట్లనియె బ్రాహ్మణులకుఁ దపస్స్వాధ్యాయ
సత్యబ్రహ్మచర్యంబులును రాజులకు దండనీతియు వైశ్యులకుఁ
గృషిపశుపాలనవాణిజ్యంబులును శూద్రులకు శుశ్రూషయు నెట్లు
పరమధర్మం బయి చెల్లు నట్ల మాకును మృగయోపజీవనంబు
పరమధర్మంబు విశేషించి యిది వంశక్రమాగతం బయిన యాచారం
బదియునుం గాక యీదేశంబునకు రాజైనజనకుండు నిజధర్మ
తత్పరుం డయి సకలజనరక్షణంబు వదల కుండు నట్లు గాన యాత్మ
కర్మంబులు విడుచువానిం దనపుత్త్రు నైనను దండితుం జేయుఁ
గావున నేనును నిజకర్మపరిత్యాగంబు సేయ నోడుదు నీదృశప్రవర్త
నుండ నయ్యును.

తే. జీవహింస యొక్కండును జేయ ననఘ
యొరులు చంపి తెచ్చినమాంస మొసర విలిచి

తగినవేళ కమ్మి బ్రదుకుదు దద్ధసమున
నమల మాంసంబు శాంతియు సాధనంబు.

చ. విషయము విస్తరిల్ల గురువృద్ధజనాతిథివిప్రదేవతా
ర్చన లొనరింతు సత్యమును శౌచము నేమము నీగి మన్ననం
దనువును భృత్యబంధుతతిఁ దాల్మి వహింతు నసూయఁ జేయ నెం
దును మదిఁ దృష్ణ నొప్పఁ బరదోషకథావిముఖుండ నెప్పుడున్.

క. సతతోపవాసనియమ
వ్రతములఁ జరియింతు నేకవనితాప్రియుఁడన్
ఋతుకాలరతుఁడ నిందా
స్తుతులందు మనంబు నాకుఁ దుల్యత నుండున్.

వ. అటుగుటం జేసి హీనజాతీయుండ నయ్యును నిర్మలుండ నైతిం బ్రసంగ
వశంబున నింత సెప్ప వలసె. నీవు ధర్మబోధార్థంబు నాయున్నయెడ
కుం జనుదెంచితి గావున నీకు ధర్మవిశేషంబు లెఱింగించెద నవధాన
తత్పరుండ వయి యాకర్ణింపుము.

క. తనకులధర్మము విడువక
మనుట పరమధర్మ మండ్రు మాన్యులు చిత్తం
బునఁ గృప గలుగుట ముఖ్యపుఁ
బని సైరణ వలయు నఖిలభావములందున్.

ఆ. విడుపు వలయు సకలవిషయవాంఛలయందు
విడుపుఁ బోలుగుణము వెదకి యెందుఁ
గాన రైరి బుధులు గలదె పరిత్యాగ
శీలునకు నసాధ్యసిద్ధి యెందు.

సీ. సత్యహితాలాపచతురత యర్థంబు
సంతతసుజనపూజనము వలయు
విను కామసంరంభవిద్వేషములఁ జేసి
మతి గలంగినను ధర్మంబు దప్పఁ

ద్రోహకర్మక నడచు టత్యుత్తమసరణి య
ప్రియములయందును బ్రియములందు
దైన్యహర్షంబులఁ దగులక యున్నట్టి
కళ్యాణవస్తుకాంక్ష లెప్ప

తే. యెగ్గు సేసినవారికి హితము సేయు
నార్యజనములు కీర్తింతు రట్టి తేప
కారి దనపాపమునఁ జాల కాలి పోవు
వేళ వానికిఁ గీడు గావింప నేల.

క. ధార్మికులు పలుపు సత్తము
కర్మముఁ జెడ నాడు నాస్తికజనము విను మా
దుర్మతుల తెఱఁగు గైకొని
ధర్మమునెడఁ బ్రీతి వదలఁ దగదు బుధునకున్.

క. మదిమఱపునఁ బాపము దన
కొదవుటయును గవప వగచి యొకపనికిని నే
నిది సేయ నింక ననియెడు
మదిఁ బెఱసిగ ముక్తి సమచు మఱలఁ బాపంబున్.

తే. పాపములకెల్ల నెక్కుడు పాతకములు
సువ్వె క్రోధలోభంబులు సువ్రతాత్మ
వాని రెంటి జయించినవాఁడు గాని
యెందుఁ బరమధార్మికుఁ డని యెన్నఁబడఁడు.

వ. శిష్టచరితంబులు గానిమార్గంబులు గొన్ని త్రయీసంప్రదాయంబులైన సూపంబులు గొంతి గపటధర్మసంప్రదాయంబులై యుండు వాని దప్పులన పరిత్యజించి శిష్టాచారంబుల నడచుట ధర్మలక్షణం బనినం గౌశికుండు శిష్టాచారంబు లెయ్యవి యెఱింగింపు మనుటయు ధర్మవ్యాధుం డిట్లనియె.

ఆ. వినుమహింస ధర్మవితతి కెల్లను మేటి
యదియు సత్యయుక్తమైన వెలయు
ననఘ శిష్టచరితలందు సత్యము కడు
ననేక మనిరి శ్రుతుల నరసి బుధులు.

తే. వేదవిహితంబులును శాస్త్రవిహితములును
శిష్టచరితంబులును ననఁ జెప్పనొప్పి
ధర్మములు మూఁడువిధములఁ దనరుచుండుఁ
గడఁగి యిన్నియు సద్గతికారణములు.

మ. అనయంబున్ శ్రుతవంతుఁడై వినుతశిష్టాచారమార్గంబులం
జనుపుణ్యాత్ముఁడు దుర్గముల్ గడచి ప్రజ్ఞాహర్మ్యసంరూఢుఁడై
కనుచుండుం బటుమోహపంకజలమగ్నం బైనలోకంబు శీఁ
క నధోభాగమునందు చెంది కడు దుఃఖం బొందఁగా నవ్వుచున్.

---

## ఘోషయాత్ర.

---

### కథాసందర్భము.

పాండవు లరణ్యవాసమునకుఁ బోయినతరువాత దమయైశ్వర్యమంతయు ధర్మబద్ధులై యరణ్యవాసము చేయుచున్న పాండుసుతుల కగపఱచి వారలను బరాభవింపవలె నని యుద్దేశించి దుర్యోధనాదులు ఘోషయాత్రకు వెడలి పోయిరి.

జనసామాన్యవిషయమునఁ గాని శత్రువిషయమునఁగాని యసూయాపరవశులయినజనులకుఁ దాము చేయఁబూనునపకారము లే తమకు మృత్యురూపముగాఁ బరిణమించి తమ్ము దుఃఖఫలములకుఁ బాల్పడఁ జేయును. ఇందులకుఁ దార్కాణము గంధర్వయూథముచేఁ బట్టువడిన దుర్యోధనునికథ.

పాండవుల నడవులకుఁ బంపినతరువాత దుర్యోధనుఁడు కర్ణాదులదుస్తంత్రముచే పాండవుల నపహసించుటకై ద్వైతవనంబునకుఁ జన యత్నించి తండ్రి యనుమతిని బడయుటకు ఘోషసంరక్షణ మనునొక మిషను గల్పించి యందులకుఁ దగిన ట్లొక గొల్లవానిచే ద్వైతవనమునందుఁ బశువులకుఁ దగినంత మేఁత యున్నదనియు నైనను

వ్యాఘ్రాదిఘాతుకమృగములబాధ యెక్కువగ నున్న దనియు ధృతరాష్ట్రునకుఁ జెప్పించెను. అంబికేయుఁడు మొదట నటు పోఁగూడ దని చెప్పి తుదకుఁ బుత్రుల మాటఁ దీసివేయలేక యట పాండవులజోలికిమాత్రము పోకుఁ డని బుద్ధులు చెప్పి యొప్పించి పంపెను. అంత దుర్యోధనుఁడు చతురంగబలములతోడను, సోదరుల తోడను, సుహృద్బంధుమిత్రులతోడను, నంతఃపురకాంతలతోడను దరలివెళ్ళి ద్వైతవనసరోవరతీరమున విడిసెను. అంతఁ దత్సరోవరరక్షకు లయినగంధర్వులు వారి నటనుండి వెడలిపొం డని చేసినతమయాజ్ఞను నిరాకరించిన కౌరవులతోఁ గయ్యమునకు దిగి వారి నోడించి భార్యలతోఁగూడ బంధించి యాకాశమార్గమునఁ గొంపోవుచుండిరి. అది తెలిసితక్కుంగలవారలటు దాపుననున్న ధర్మరాజునొద్దకేతెంచి సమస్తము విన్నవించి దుర్యోధనాదుల రక్షింపవేఁడుకొనిరి. అప్పుడు ధర్మనందనుఁడు జన్నము సేయుచుండుటచే భీమార్జునాదిసోదరులఁ బిలిచి గంధర్వులతో మంచిమాటలు చెప్పి దుర్యోధనాదులను విడిపించి తీసికొని రావలసిన దనియు వా రందుల కియ్యకొనరేని కయ్యము చేసియైనను విడిపింపవలసిన దనియుఁ జెప్పెను. భీముఁ డందుల కిష్టపడక తమకుఁ జిన్ననాఁటనుండియు నపకారపరంపరలం జేసినదుర్యోధనాదులు గంధర్వులచేఁ జిక్కినపుడు తా మేల గంధర్వులతోఁ బోరి కౌరవులను విడిపింపవలె ననియు నదెట్టినీతి యనియు; నది రాజధర్మము కా దనియు వారలు మిగిలియుండినచో తమ కపకారమే యగు ననియుఁ జెప్పినను ధర్మతనయుండు వినక యిట్టిపరుషవాక్యముల కిది సమయము కా దని మంచిమాటలు చెప్పి యొప్పించి తనసోదరులను గంధర్వులపై కంపెను. అప్పుడు భీమాదులు గంధర్వులతో ముందు కౌరవులను వదలివేయవలసిన దనియు నిది ధర్మనందనునియాజ్ఞ యనియుఁ జెప్పిన గంధర్వులు తమప్రభు వగు దేవేంద్రునాజ్ఞ చెల్లించుట తమకుఁ బాడి గాని ధర్మనందనునాజ్ఞతో నిమిత్తము లే దనుటయు పాండవులు వారితో యుద్ధముచేసి కౌరవులను విడిపించి గంధర్వరాజగు చిత్రసేనునితోఁగూడ సుయోధనుని యుధిష్ఠిరునియొద్దకుఁ దీసికొని వచ్చిరి. అప్పుడు చిత్రసేనుఁడు ధర్మజునకు వందనముజేసి వానిచే ననుగ్రహింపఁబడి మరలి పోయెను. ధర్మసుతుఁడు బంధింపఁబడినసుయోధనుని బంధవిముక్తిం జేయించి వానికి హితోపదేశముచేసి హస్తిపురికిం బంపివేసెను. దుర్యోధనుండు లజ్జావనతవదనుండై మాటాడక వెడలిపోయెను.

నీతి— జ్ఞాతులు తమలోఁదమకు విరోధము లున్నను శత్రువులు తమమీఁద నెత్తివచ్చినప్పు డంతఃకలహములు మాని యందఱు నొక్కటై యరుల నోడింపవలయు ననియు నక్రమమునకు దిగినవారు తుదకు దైవవంచితు లగుట ధ్రువ మనియు నీకథవలనఁ దేటపడుచున్నది.

దుర్యోధనుఁడు ఘోషయాత్రఁ బోవుట.

వ. దుర్యోధనుండు మృగయావినోదంబునకుం దొడంగి.

మ. హరిణవ్రాతములం గలంచుచు నుదగ్రానేకపశ్రేణిఁ జె
చ్చెర బంధించుచు నుగ్రసింహనివహచ్ఛేదైకసంక్రోధబం
ధురతం బేర్చుచుఁ బ్రస్ఫురన్మహిషశార్దూలోద్ధతక్రోడని
ర్భరపాతంబు లొనర్చుచుం దిరిగె భూపశ్రేష్ఠుఁ డక్కాననోర్విన్.

వ. మఱియు నానావర్ణసురభికుసుమప్రకరపరికీర్ణంబు లగుజలాశయంబు లాలోకించుచు సతతమనోహరప్రసూనఫలభరితపాదపవనాభ్యంతరంబుల విహరించుచు మత్తమయూరమధుకరకీరకోకిలాలాపకోలాహలంబు లాకర్ణించుచుఁ గ్రమంబునం బరిజనసమన్వితుండై ధార్తరాష్ట్రుండు ద్వైతవనసరోవరంబు సేరం జని యెనంత నట ధర్మనందనుండు రాత్రసత్రాహంబున మునిజనసహాయుండై వన్యంబు లగుఫలమూలవిశేషంబులు సాధనంబులుగా సద్యస్కందం బనుయజ్ఞంబు సేయుచుండె నప్పుడు దుర్యోధనుండు నిజభృత్యజనులు నక్కొలని దరిం గ్రీడాగృహంబులు నిర్మింప నియోగించిన.

క. వారును సంభ్రమమున న
వ్వారిరుహాకరముపొంత వదలక క్రీడా
గారములు గట్టఁ దొడఁగుడు
వారించుచుఁ బాఱుతెంచి వడి గంధర్వుల్.

వ. ఇది చిత్రసేనుం డనుగంధర్వపతికిం గ్రీడార్థంబు కల్పితం బైనది గావున మీ రిక్కొలను సేరక తొలంగి పొండు యనిన వారు మగుడం జని దుర్యోధనునకుఁ జెప్పుటయు నతండు రణదుర్మదు లైనసైనికులం గొందఱం బంచిన నరిగి వారలు గంధర్వుల దట్టిరి.

మ. బలియుం డాధృతరాష్ట్రసూనుఁడు మహాబాహుండు దుర్యోధనుం
డలఘుం డీకమలాకరంబునకుఁ గ్రీడార్థంబు గౌతూహలం

బెలయఁగాఁ బ్రియకామినీసహితుఁడై యేతెంచుచున్నాఁడు మీ
ర్వుల దిందుఁడుఁ దొలంగి పొం డనవుడున్ వా రుద్ధతక్రోధులై.

వ. ఒండొరువుల మొగంబులు సూచి పెలుచ నవ్వి వారల కి ట్లనిరి.

క. ఎదిరిం దన్ను నెఱుంగఁడు
మదమునఁ బ్రాణంబుఁ దనదుమానముఁ గోల్పో
మదిఁ దలఁచినాఁడు మీ నృపుఁ
డిది నేఁటికిఁ జెఱఁటిచెయ్వు లిన్నియు నిచటన్.

వ. బుద్ధిమంతుఁడై యూరక చనుట లెస్స యనుం డనినం గ్రమ్మఱి
చని వారు కురుపతికిం దద్వచనంబుల తెఱం గంతయు జెప్పుటయు
నతండు రోషావేశవివశుండై తమ్ములం దొరలం జూచి మీ రిందఱు
మీమీ సైన్యంబులతోడం గూడి కదంగి దుర్వినీతులైన గంధర్వుల
గర్వంబు మాన్పి సరోవరం బాక్రమించునది. వారికి సహాయుం
డయి సురగణసమేతుండుగా నింద్రుండు సనుదెంచె నేనియు నవలీల
జయించునది యని నియోగించిన.

క. అతులచతురంగసేనా
న్వితు లలఘు ధృతరాష్ట్రసుతులు నిరతిశయమదగర్వో
ద్ధతసింహనాదబధిరీ
కృతదిఙ్ముఖు లగుచుఁ జనిరి గినుక యెలర్పన్.

వ. ఇట్లు సనుదెంచుకురువీరుల కడ్డంబు వచ్చి కొందఱుగంధర్వులు
ప్రియపూర్వకంబుగా నిట రాఁకు వచ్చెదరు. మీరు మాతోడివిద్వేషం
బేటికి నిలుపుం డనినం బెలుచ నార్చి సేనాగ్రచరులు వారల
మీఁదం బ్రచురశస్త్రాస్త్రపాతంబు సేయం దొడంగినం దొలంగి చని
యాగంధర్వు లాక్షణంబ చిత్రసేనునకు నంతయుఁ జెప్పిపుచ్చినం
బ్రబలరోషరంజితాననుం డై యతండు.

క. చనుఁడు రయంబున నాదు
ర్జనులం గౌరవులఁ బొదివి సమయింపుఁడు మీ

రని బహుసహస్రసంఖ్యులఁ
బనిచెను గంధర్వవరులఁ బ్రకటితబలులన్.

వ. ఇట్లు పనిచిన.

ఉ. ఆయతకుంతకార్ముకగదాసిపరశ్వధతోమరపట్టిసా
ద్యాయుధఘోరహస్తులు కులాచలతుంగతనుల్ ప్రచండతే
జోయుతు లాపిమచ్చరులు ఘోరతరోద్ధతి తెంచి బల్విడిం
గో యని తాఁకి రుగ్రరణకోపము లై కురురాజసైన్యమున్.

వ. ఇవ్విధంబున గంధర్వులు బెట్టిదంబుగాఁ గిట్టి నొప్పింపం బోడంగినం గలంగి దుశ్శాసనాదికౌరవులు సర్వసైన్యంబుగాఁ దెరలి దుర్యోధనుచేరువకుం బఱచినఁ గర్ణుం డొక్కరుండ సుస్థిరుండై నిలిచి గంధర్వుల నిలువరించి భల్లార్ధచంద్రప్రముఖబహుళబాణపాతంబులం దదీయదేహంబులు ఖండించుచు నిమిషమాత్రంబునఁ బ్రాసేనున్న నికశతంబుల హాపుహాపుటలు మాటియుం బైన గంధర్వులు శతసహస్రసంఖ్యలు తోఁతెంచి బృహిమె యెల్లను గంధర్వమయం బైనట్లుండె నప్పుడు.

చ. శకునియుఁ దమ్ములుం బ్రబలసైన్యముతో నడతేర నాహవో
త్సుకమతి యై సుయోధనుఁడు సూతతనూజునియున్నచోటికిం
బ్రకటభుజోగ్రతం గడఁగి బల్విడిఁ దద్రిపుకోటిఁ దాఁకినన్
సకలజగద్భయంకరలసత్సమరోత్సవ మయ్యె నయ్యెడన్.

క. కొండొకసేపునకు మహో
ద్దండస్ఫురదనేకఘోరతరవిశిఖవ్యా
ఖండితశరీరు లై ధృతి
ఖండితముగఁ బల్లటిలిరి గంధర్వు లనిన్.

చిత్రసేనుం డను గంధర్వరాజు దుర్యోధనునితో యుద్ధము సేయుట.

క. గంధర్వులు దెరలుట విని
గంధర్వవిభుండు క్రోధకలుషితమతియై

గంధగజముచందమున మ
దాంధగతిం గవిసెఁ గౌరవానీకముపై.

వ. ఇట్లు గవిసి చిత్రసేనుండు

శా. మాయామూసంగరకోవిదుండు వికసన్మాయాస్త్రజాలంబులన్
వాయువ్యాప్తి యడంగ నర్కకిరణవ్రాతంబు రుద్ధంబుగాఁ
జేయం జొచ్చినఁ ద్రెళ్ళెఁ దేరులు కరుల్ శీర్ణంబు లయ్యెన్ దళ
త్కాయం బయ్యె హయాలి గూలిరి నరుల్ గౌరవ్యసైన్యంబునన్

క. పొదలి యొకని కొక్కరికిని
బదుగురు పదుగురుగఁ గవిసి కౌరవసేనం
బాదివి సమయింపఁ దొడఁగిరి
వదలక గంధర్వులని సవార్యోద్ధతులై.

వ. ఇవ్విధయచ్చరులవిక్రమంబునకు నోర్వక బెదరి చెదరి కురురాజ
సైన్యంబు ధర్మనందనుం డున్నకంనువకుఁ బాఱం దొడంగె నప్పుడు
రాధేయుం డజేయుండై కులశైలంబునుం బోలెఁ దరలక నిలిచి
గంధర్వులు గురియుశరవర్షంబున మునుఁగుచుఁ దనయోపినంత
పెనంగుచుండె. సోదరసౌబలసహాయుండై దుర్యోధనుండు గర్ణ
సాహాయ్యంబు వదలక నిలిచె నంత ననంతసత్త్వులైన గంధర్వు
లనేకులు సుట్టు ముట్టి.

ఉ. కొందఱు సూతు నశ్వములఁ గొందఱు గొందఱు చాపదండముం
గొందఱు చక్రయుగ్మకముఁ గొందఱు విస్ఫురితాతపత్రముం
గొందఱు కూబరంబు మఱికొందఱు కేతువుఁ గొంద ఱక్షముల్
దందడిఁ ద్రుమ్మి వైచి విరథత్వ మొనర్చిరి సూతిసూతిఁ న్.

వ. ఇట్లు విరథుండై కర్ణుండు వికర్ణురథం బెక్కి రణభూమికిం దొలంగి
చనియె. దుర్యోధనుండు విముఖుండు గాక పరబలంబు మూలాకాని
పెనంగం దొడంగినం గినిసి చిత్రసేనుండు వానిం దలఁపడి తదీయ

స్యందనంబు రాధేయురథంబు పట్లు భగ్నంబుగాఁ జేయించి విరథుం
డగునమ్మహీవిభుం గేశాకర్షణంబున నేలం బడవైచి పెడకేలు గట్టి
సింహనాదంబు సేసినం దక్కినగంధర్వులుం గనుకనిఁ బఱచి యతని
వనితాజనంబులను దత్సోదరులగు దుశ్శాసన దుస్సహ దుర్ముఖ
వివింశతి చిత్రసేన విందానువిందులను దత్తనూభవులను దదీయ
మంత్రులను బట్టి బంధించి చిత్రసేనున కొప్పించి రంతఁ బెఱకౌరవు
లును వారలు నమాత్యులుం జెదరి యాక్రోశించుచుం బఱచి ధర్మ
పుత్త్రు శరణు సొచ్చి యిట్లనిరి.

మ. ఘనబాహాబలదుర్నివారమహిమన్ గంధర్వవీరుల్ సుయో
ధనుఁ దత్కాంతలఁ దత్సహోదరుల బంధప్రాప్తులం జేసి కై
కొని వే పోవుచు నున్నవా రదె రిపుక్షోభంబు గావించి నీ
యనుజవ్రాతముఁ గావవే కరుణ నిండారంగ రాజోత్తమా.

వ. అని కృతాంజలులై పలుకుచున్న వారిం జూచి భీమసేనుండు
ప్రహసితాననుం డగుచు ధర్మపుత్త్రున కిట్లనియె.

ఆ. మనకుఁ జాలకయ్యె మనచేయుపని గం
ధర్వవరులు గూడి తగ నొనర్చి
రింత లెస్స యగునె యేభారమును లేక
యూరకుండ మనల బొందె జయము.

తే. పుట్టుఁగల్లరి యై పాపములకు నెల్ల
దిట్ట యై లోకములచేతఁ దిట్టువడిన
కట్టిఁడికి నిట్టికష్టంబు గా నొనర్చి
తగ విధాతృఁడు చతురుఁడై నెగడె నేఁడు.

మ. విపరీతస్థితి నొంది ఘోరవిపినోర్వీవాసులై నిత్యదుః
ఖపరాధీనతఁ దూలి రంచు మనలన్ గర్వాంధితస్వాంతుఁడై

యపలాపింపఁగ వచ్చి దుర్ణయపరుం డాధార్తరాష్ట్రుండు ద్రో
హపరీతాత్ముఁడు దత్ఫలంబు గుడిచెన్ సత్యంబు సామాత్యుఁడై.

వ. వానిదెసం గృప సేయ వల దనిన ననుజునకు నగ్రజుం డిట్లనియె.

క. అకట యిది పరుషవాక్యము
లకు సమయమె శరణు సొచ్చి లఘుభావమునో
వికలగతి నున్న కౌరవ
నికరమునకుఁ గరుణ సేయ నీకుం దగదే.

వ. ఏకాన్వయజాతు లైనవారికి నర్థనిమిత్తం బయినభేదం బొక్కొక్క మాటు వర్తిల్లు నంతనంతచేసి సహజస్నేహంబు దప్ప నేరదు. జ్ఞాతి జనంబులు దమలో నెట్టివా రైన నొప్పుం గాని యన్యులవలనం బరిభవంబు దోడరినప్పుడు దా రొండొరులఁ జేకొనకునికి లోకనింద్యంబు దుర్యోధనుండు దుర్వినీతుం డైనను సభార్యుం డయి పరుల చేతం బట్టువడియె. దీని నుపేక్షించిన మనకుం గులహాని యగు నిదియునుం గాక శరణాగతరక్షణంబు రాజమాత్రంబువాని కెల్ల ధర్మంబు నీయట్టి బాహుబలసంపన్నునకు నిట్టిసుకర్మంబు గర్తవ్యం బని వేఱ చెప్ప నేల లెమ్ము నీవును నీతమ్ములు నిమ్ముల రథంబు లెక్కి సర్వాయుధసన్నద్ధు లై చని సుయోధనుచెఱ దలుగుం డనిన బవననందనుండు ధర్మనందనున కి ట్లనియె.

సీ. అనుమానమొక్కింతయును లేక యలిగి జ
లంబులఁ ద్రోచె విషంబు వెట్టె
గృహదాహ మొనరించె విహితదురోదర
కపటుఁ డై రాజ్యంబు నపహరించె
జను లెల్లఁ జూడంగ వనజాక్షిఁ బాంచాలిఁ
దల వట్టియీడ్పించె వలువ లొలువఁ
బనిచెఁ బుట్టినకోలె మనకు నక్కట సుయో
ధనుఁ డెగ్గు సేయనిదినముఁ గలదె

ఆ. వానిచేత లోకటియేనియుఁ దలఁపవు
నీవు మనుజనాథ కేవలంపు
గరుణ వాని యందు దరయ నెప్పుడు నిట్టు
లైన మనకుఁ గార్యహాని గాదె.

వ. అని పూర్వవైరస్మరణకలుషితుం డై పలికిన సతనికి నజాతశత్రుండు సాంత్వనపూర్వకంబుగా ని ట్లనియె.

ఆ. కావరయ్య యనినఁ గరము దుర్బలుఁ డైనఁ
జెనసి మోపినంత సేయు సనిన
నూరకుండు నయ్య యుత్తమశూరుండు
దీనజనులయున్న తెఱఁగు సూచి.

క. శరణం బని వచ్చిన భీ
కరశత్రుని నయినఁ బ్రీతిఁ గావఁగవలయుం
గరుణాపరుల తెఱం గిది
యిరవుగ నరిగావు దీని కేధర్మంబుల్.

వ. ధృతరాష్ట్రసూనుండు భవదీయబలశౌర్యంబులపేర్మి మెఱుంగుం గావునఁ దన్ను నవశ్యంబును విడిపింతు రని మనదెస బద్ధాశుం డై యుండు నిది మనకుఁ బుణ్యంబును గీర్తియుం జేకొనుసమయంబు నిన్నింత నిర్బంధింప వలవ దేన యరుగుదు నిప్పుడు యజ్ఞదీక్షితుండ నై యున్నవాఁడఁ గావున నాకుం జనరాదు మీరు వేగ చని గంధర్వులం బ్రియపూర్వకంబుగా ననునయించి సుయోధను విడిపించునది. సామవచనంబులం దీర కున్నఁ బరాక్రమంబున నైనం బ్రతివీరుల నోర్చి కార్యంబు దీర్చునది నాచేయుజన్నంబు సఫలంబు సేయుం డనిన భీముం డెట్టకేనియు నియ్యకొనియె నర్జునుండును ధర్మరాజుపనుపు గైకొని కురురాజుచెఱ దలుగఁ బ్రతిజ్ఞ సేసె. నకుల సహదేవులు నుత్సాహసమేతు లయి రన్నలువురు నాము క్తకవచులు

నాబద్ధతూణీరులు నాకలితకార్ముకులు నానూధరథులు నయి యగ్రజు
వీడ్కొని యత్యత్వరితగతి నడచినం గౌరవసైన్యం బంతయు వారిం
గూడుకొని సింహనాదంబులు సెలంగ జనియె నిట్లరిగి వారలు
గంధమాదనంబున కరిగి చను చున్నయవ్వియచ్చరానీకంబుం గూడ
ముట్టిన.

భీమార్జుననకులసహదేవులు గంధర్వులతో యుద్ధంబు సేయుట

క. కని గంధర్వులు గ్రమ్మఱ
ఘనులం బాండవుల నగ్నికల్పులఁ దేజో
ధనుల నమరేంద్రసదృశుల
ననఘుల మార్కొనిరి ప్రకటితాటోపమునన్.

ఉ. అగ్రజవాక్యముల్ దలఁచి యర్జునుఁ డప్పుడు వారితోడ న
త్యుగ్రత దక్కి యెంతయుఁ బ్రియోక్తుల నిట్లను మీరు మాయెడన్
విగ్రహ మేల నెయ్యమున విడ్వఁడు కౌరవరాజుఁ బార్థివ
ప్రాగ్రసరుండు ధర్మసుతు పన్పిది మీకు నలంఘ్య మిత్తఱిన్.

వ. అనిన నతనికి గంధర్వు లిట్లనిరి.

తే. ధర్మజుఁడు మాకుఁ బ్రభుఁడె యీధర్మతనయు
నాజ్ఞ నే మేల యొనరింతు మనిమిషేంద్రుఁ
డొక్కరుఁడ మమ్ము శాసింప నోడయుఁ డన్యు
లెందు నెవ్వరైనను భయ మేము మాకు.

వ. అనిన విన్వచ్చుం డవ్వియచ్చరుల నుపలక్షించి మునుమున్న తెగు
వకుం జోర నేల యని ప్రియంబును ధర్మంబునుం గాఁ బలికితి నెట్లును
మీరు సామసాధ్యులరుగా కునికి దోఁచు చున్నయది గావున నుగ్రం
బయినవిగ్రహంబున దుర్యోధను విడిపింతు నని వారలమీఁద నిశిత
విశిఖప్రకరంబులు ప్రయోగించె నాగంధర్వులు నతనిపైఁ బటుబాణ
వర్షంబులు గురిసి రిట్లు నలువురకు ననేకగంధర్వశతసహస్రంబులతో
నతిఘోరసమరం బయ్యె నప్పుడు.

తరలము. కదిసి యర్జునుతేరు భగ్నముగా నొనర్పఁ దలంచి పె
ల్లొదవి ఖేచరకోటి గ్రమ్ముటయుం బురందరనందనుం
డదయుఁడై పదిలత్వలం బ్రళయాగ్నికల్పుల దివ్యలం
గదనశూరుల నిర్గహించె బ్రకాండదివ్యశరార్చులన్.

మహాస్రగ్ధర.

ఘనకోదండోగ్రమౌర్వీక్వణ మఖిలనభోగహ్వరాభోగభాగం
బున నాపూర్ణంబుగా నుబ్బునఁ గవలు మరుత్పుత్రుఁడుం దీవ్రనారా
చనితాంతాపాతలీలాసరభసగతులై శత్రువీరవ్రజంబుం
దునుమంచచ్ఛోణితంబుల్ దొఱఁగి మడువులై తోఁచె నయ్యుద్ధభూమిన్.

వ. ఇట్లు కౌంతేయులచేతం బీడితులై గంధర్వులు దుర్యోధనాదుల
జెఱ లేమఱక కొనుచు గగనంబును నెగసి తోఁచి పోవ నుంకించిన
నెఱింగి సవ్యసాచి రయంబున నతినిబిడ బాణజాలంబులం జేసి దిఙ్నభో
మార్గంబులు నీరంధ్రంబులు గాఁ గప్పిన నగ్గగనచరులు వలలోనం
జిక్కినపులుఁగులుంబోలెఁ బోవ నేరక శరపంజరంబునం జిక్కి కు
నుక్కి సెడక యన్నలుప్రరమీఁద వివిధాయుధ పరంపరలు ప్రయో
గించిన.

మ. అవి యెల్లం దునుమాడి క్రీడి ఘనరోషాక్షీలుఁడై శాత్రభ
ల్లవితానం బడరించినం దలలు ద్రొల్లం గాయముల్ మింటనుం
డి వడిం గుంభినిఁ గూలఁగా రుధిరవృష్టిం గాలువల్ వాఱఁగా
దివి గంధర్వులక్రం దడంగె జగ ముద్వేగంబునం బొందఁగన్.

వ. మఱియు నర్జునప్రయుక్తం బయినయాగ్నేయాస్త్రంబు దావాగ్ని
నీరసవిపినంబు దహించుతెఱంగున గంధర్వనివహంబు నీఱు సేయం
దొడంగినం గినిసి చిత్రసేనుండు భీమసేనానుజుమీఁదం బటుగదా
దండంబు వైచిన నతండు దాని నేడుదునియలుగా నేయుటయు
గంధర్వరాజు మాయాబలంబున నంతర్హితుండై.

క. నలువురు పార్థుల నత్యు
జ్జ్వలశరవర్షముల ముంచి జలధరముక్రియఁ
జెలువగ గర్జిల్లుచు న
క్కలుఁ డయి తనవిక్రమంబుఁ గడఁకయుఁ జూపెన్.

ఆ. దాని నుఱక యింద్రసూనుండు గాండీవి
శబ్దవేధు లయినసాయకములఁ
జిత్రసేనుసర్వగాత్రంబు భేదించి
యొక్కమాత్రలోన నుడిపెఁ గడఁక.

వ. ఇట్లు నొచ్చి గంధర్వనాయకుండు రణసంరంభంబు విడిచి యర్జునుఁ జేరం జని తనపాడసూపి నిలిచిన సవ్యసాచియుండును నాత్మసఖుండయిన ఖేచరపతి తెఱంగు సూచి సంహృతాస్త్రుం డయ్యె. వృకోదరాదులును సమరవిరామంబు నొందిరి. వార లందఱుఁ దమతమరథంబులమీఁదన యుండి యొండొరులఁ గుశలంబు లడిగి రప్పు డర్జునుండు చిత్రసేనున కిట్లనియె.

క. వీరోత్తమ నీ కిమ్మెయి
వైరము దగు నయ్యె కౌరవప్రకరముతోఁ
గౌరవపతి విడువుము త
ద్దారానుజసుతసమన్వితంబుగ నెమ్మిన్.

వ. అనిన నతం డర్జునున కిట్లనియె.

సీ. ఈదురాత్ముఁడు మిమ్ము నివ్వనంబున నితాం
తాయాసపీడితు లైనవారిఁ
బరమధర్మాత్ముల భార్యాసమేతుల
నపహసింపఁ దలంచి యరుగుదెంచె
నింతయు నెఱిఁగి సురేంద్రుండు గలుషించి
యనుజవధూసహాయాన్వితముగఁ

పాపవర్తను వీనిఁ బట్టి తె మ్మని నన్ను
బనిచిన వచ్చితిఁ బార్థ వినవె

తే. శత్రుపాలికి నిడె కొని చనుచు నున్న
వాఁడ నీవింక నొం డనవలదు వినుము
మత్సఖుండవు గావున మత్సరంబు
నలుకయును లేదు నీదెస ననఘ నాకు.

తే. అనిన నర్జునుఁ డతని కిట్లనియె నీసు
యోధనుఁడు మాకు వినుము సహోదరుండు
గాన యీతని విడుచుట గర్జ మిదియ
ధర్మజున కెంతయును బ్రమోదంబు సేత.

చ. అమరవరేణ్యుప న్పయిన నావల నెయ్యది యైన నిప్డు ధ
ర్మమహితుఁ డైన ధర్మజునమక్షమునం దెఱిఁగించి యాత్రఁడే
క్రమమున నెద్ది సెప్పె నది గైకొని చేయుము నీవు మత్ప్రియా
ర్థము చనుదెమ్ము నావుడును దాని కొడంబడి చిత్రసేనుఁడున్.

చిత్రసేనుఁడు ధర్మరాజునొద్దకు వచ్చి దుర్యోధనుని విడిచిపెట్టిపోవుట.

వ. వారలుం దానును ధర్మజుకడకుం జనిన నయ్యజాతశత్రుండు చిత్ర
సేను నతిప్రియంబునం బూజించి మహాత్మా యీసుయోధనుండు
సానుజామాత్యుం డయి మీచేత వధియింపం బడ కునికి మే
లయ్యె. మీకారణంబున మావంశంబునకు నొం డొక్కహాని
వొంద దయ్యె. వీఁ డెట్టియపరాధంబు సేసినను నది యంతయు
సహించి మాకుం గా వీని విడువ వలయు నని ప్రార్థించిన నతం
డట్ల కాక యని దుర్యోధనాదుల నందఱ విడిచి పాండుపుత్త్రుల
నామంత్రణంబు సేసి దివంబున కరిగి తత్ప్రకారంబు సకలంబును
నింద్రునకు నివేదించిన నింద్రుండును సమరనిహతు లయినగంధర్వుల
నమృతవృష్టిం జేసి బ్రతికించె నిట యుధిష్ఠిరుండును ధార్తరాష్ట్రు
నకు బంధమోక్షణంబు గావించి వాని కిట్లనియె.

ధర్మనందనుఁడు సుయోధనునకు నీతి చెప్పి పంపుట.

**ఉ.** ఎన్నఁడు నిట్టి సాహసము లింక నొనర్పకు మయ్య దుర్జనుం
డన్నన సాహసక్రియలయందుఁ గడంగి నశించుఁ గావునం
గ్రన్నన తమ్ములన్ దొరలఁ గైకొని యిమ్ములఁ బొమ్ము వీటికిన్
సన్నుత దీని కొండొకవిషాదముఁ బొందకుమీ మనంబునన్.

**వ.** అని బుద్ధి సెప్పి వీడ్కొలిపిన నతండును దీనాననుం డగుచు జనియె ననుజసహితుం డయి ధర్మతనయుధార్మికత్వంబు ధౌమ్యాదిభూసురులును దదాశ్రమవాసు లయినమహామునులును బహువిధంబులఁ బ్రస్తుతించిరి.

---

## హంసకాకీయోపాఖ్యానము.

:(o):

### కథ.

భీష్మద్రోణులు గూలినతరువాతఁ గర్ణుఁడు కౌరవసేనాధిపతి యయ్యెను. అతనికి శల్యుఁడు సారథి యయ్యెను. కర్ణునిగర్వమును నవివేకమును జూచి శల్యుఁడు వానిని మందలించుచు నీకథ సెప్పెను.

సర్వజనులు తా మాచరించు పనులలో విధినిషేధములను గుర్తెఱిఁగి యాచరింపవలయును. తాము వ్యవహారములలో శక్తి కిమించిన పనులను సాధింపఁబూనుటయే గొప్ప యవివేకము. కావున మొదటనే తానుద్యమించు వ్యవహారముల గుఱుతెఱింగి తనబలము వ్యవహారబలమును నెదిరిబలముఁ దెలిసికొనక తమకించు నెడలఁ దొలఁగింపరానివిపత్తుల కాకరమై దుఃఖాస్పదుఁ డగును. కావున ప్రప్రథమముననే తా నాచరింపఁబూను వ్యవహారములయనులోమవిలోమములను బరిశీలింపవలయును. తలపు మించినపనికిఁ బోఁగూడదు.

ఇందుకుఁ దార్కాణము శల్యుఁడు కర్ణునకుఁ బ్రబోధించిన హంసకాకీయోపాఖ్యానం బనునితిహాసంబువలనఁ దేటపడును. అశక్తతగల యొకకాక మొకవైశ్యగృహమున నెంగిలిమెతుకు లతికొనితిని, తిరిగి చియ్యపట్టి తనశక్తికి మీఱినపనుల నాచరింప నుద్యమించుచు వణిగ్బాలురచేసముద్రతీరమునకుఁ గొంపోఁబడి యచ్చట నొక హంసరాజమును గెలిచెదనని దానితోఁ బన్నిదంబు సలిపి సముద్రోపరిభాగమున నెగురుటకు

నిశ్చయము చేసికొని తుట్టతుదకు శక్తిచాలక సముద్రములోఁ బడిపోవుచుండుటఁ గని మరాళ రాజమంతఁ బూర్వము తన్నది నిరాకరించినను మనంబున నీసు పొరయక విపద్దశయందు సహార్ద్రవర్తియై దానికిఁ బ్రాణదాన మొసంగుట కుద్యమించి కాకమును దన ఱెక్కలపైఁ బెట్టుకొని నొడ్డుచేర్చి శక్తికిమీఱినపని చేయఁదగదని హంసరాజ మవ్వాయసమునకు బుద్ధిచెప్పి గృహమున కనిపి తాను యథేచ్ఛం జనియె.

నీతి — తలకుదాఁటిన పనులెన్నఁడు నాచరింపఁగూడదు. కావున బుద్ధిమంతులను బాలురు తమ్ముఁ దోడిబాలురు బుద్ధిహీనులై యవమానించి తిరస్కరించినను నట్టివారికి విపత్తు తటస్థించు సమయములయందు నుపకృతిసేయ మనమున నిడికొని యట్లాచరించుట శ్రేయస్కరము.

సీ. అంబుధిలో నొక్కయులఘురత్నద్వీప
మున ధర్మవర్ధి నాఁ జనునరేంద్రు
పురమున నొకవైశ్యవరుఁ డధ్వరాదిస
త్కర్మరతుఁడును శాంతిదాంతియుతుఁడుఁ
కరుణాపరుఁడు దాననిరతుండు ధనధాన్య
శోభియు బహుపుత్త్రలాభవిలసి
తుండు నై వర్తించుచుండఁగ నిలు సేరి
నొక కాకి యతనిపుత్త్రకులు దాని

తే. కెంగిళులు పెట్టి కొనిమూడ నెలమిఁ బెరిఁగి
క్రొవ్వి కడు మీఱి యెట్టిపక్షులును దన్నుఁ
బోల వనియెడుదుర్మానమునఁ దృణీక
రించి యవి పెక్కుభంగులఁ గ్రీడ సలుపు.

వ. ఇట్లు విహరించుచుండ నొక్కనాఁడు కొన్నిహంసంబులు పక్ష
బలంబున సుపర్ణుతో సరిసేయం దగునట్టివి సముద్రంబు చేరువఁ జనం
గని యాకోమటికొడుకు లక్కాకంబునకు వానిం జూపి యిట్లనిరి.

క. పులుఁగులలో నీ వెక్కుఁడు
విలసద్గతి సంచ లిట్లు వినువీథిఁ గరం

బెలమిం జనియెడు వీనిం
గలసి పఱచి గెలువ వలదె గతులబహుళతన్.

వ. అని తారతమ్యజ్ఞానహీను లగునయ్యల్పబుద్ధులు సెప్పిన నుచ్ఛిష్ట దర్పితం బగునదియును మాత్సర్యంబునం దా నంతటిదాన నని తలంచి వానిదెసకుం జని మనంబున వీనిలో మేటి యెయ్యదియో యనుచుం జేరి తనచూడ్కికి వచ్చినయంచం బురసించి పఱతము రమ్మని పిలిచిన నయ్యంచ లన్నియు నిలిచి బెలుచ నవ్వి యవ్వాయసంబున కిట్లనియె.

క. మానససరసి వసింతు మ
హీనబలము జవముఁ బక్షు లెల్లను బాగడం
గా నెందుఁ దిరుగుదుము ద
వ్వైనను ఖేదంబు లేదు హంసల మగుటన్.

వ. ఇట్టిమాయందును.

క. బలశాలి యైనహంసముఁ
బిలిచితి పురుడించి పాఱ బేలతనమునన్
గలవే యింతకు మును హం
సలతోఁ బురుడించువాయసంబులు జగతిన్.

సీ. అనుటయుఁ గాక మిట్లను హంసములతోడ
గతులు నూటొక్కటి గలవు వాన
నొక్కటొక్కట శతయోజనవ్యాప్తి నే
మెఱయుదుఁ బొడవుగా మీఁది కెగసి
చనుట యచ్చటనుండి చక్కనేలకుఁ జోడు
వట్టి డిగ్గుట దూరపాతభంగి
సంగతి పరువడి చారులీలాగతి
వక్రయానము వలయక్రమంబు.

ఆ. లోనుగాఁగ నెట్టులైనను మీఁకోరి
నట్లు పఱచి మేటియంచ నైన
దాని నిపుడ గెలుతుఁ దక్కటియంచలు
భయముఁబొందఁ గాకిపదువు వొంగ.

కాకము భంగపడుట.

వ. అనుటయు విని మున్నాహూతం బైనహంసం బక్కాకంబు నాలోకించి.

ఆ. నూఱుగతుల నీవు వాఱు దేనన్నియు
నెఱుఁగఁ బలుఁగు లెల్ల నెట్లు వాఱు
నడరి యాకసమున నిడుబాట నట్ల పా
ఱుదము రమ్ము జలధిచదల ననిన.

వ. అయ్యేడం గూడినకాకంబు లపహసించి శతప్రకారగతి యగుకీనితో నేకయానపర్యవసానహీనసముత్సాహదోహాలి వగునీ వెట్లు మచ్చరించెదవు. పఱచి భంగపడియెదవు గాక యనుటయు నమ్మరాళం బాగమిం బాసి పఱవఁ దొడంగినం దోన యవ్వాయసంబునుం బఱచె నిట్లు రెండును మున్నీటిపై మిన్ను దఱిసి పాఱునట్టియెడ.

క. రాయంచ మందగతిఁ జను
వాయస మతితీవ్రభంగి వలను మెఱసి లీ
లాయితము లొప్ప బహుగమ
నాయాసము నొంది పఱచు నగ్గలికమెయిన్.

ఆ. ఎలమిఁ గడఁచి పోవుఁ బిలుచుఁ గ్రమ్మఱి వచ్చి
ముక్కు ముక్కుమీఁద మోపుఁ జుట్టు
నేచి తిరుగు నీఁక లీఁకలతో రాయుఁ
నొరయుఁ జిత్రగతుల మఱియు నవ్వు.

వ. ఇవ్విధంబున గాకం బనేకప్రకారప్రసరణచతురం బై నంచరించుటం జూచి ముదితంబు లైనవాయసంబు లధికస్వరంబుల మెఱయుచు

హంసంబుల కేలి గొని నవ్వుచుఁ దరువులపయిం ద్రుళ్ళి త్రుళ్ళి యాడుచు మరాళంబు పరాభవంబుఁ బొందెదుఁ జూడుం డని పెద్ద యెలుంగునం బలుకుచుండఁ దదీయకలకలం బాలించి హంసంబు భరితోత్సాహంబై.

క. పోడవునకు నెగసి యెప్పటి
పడమటిదెస నిగిడి పిలుచఁ బఱచినఁ గూడం
గడురయమునఁ జని యంచం
గడవం గా కిలకఱచి కాకము పొఱిన్.

వ. పాటి పాటి డయ్యుటయు నయ్యంచ యుచంచితత్వరితగమనకళా వైదగ్ధ్యంబు మెఱయం బఱచిన బీరువడి కాకం బాకులాంతరంగం బును వికలాంగంబును నై యిట్లని వితర్కించు.

క. నేరక తొడరితిఁ గాల్కొన
భూరుహములు లతలు గిరులుఁ బొడ లేమియు లే
వారయ బహుసత్త్వమయము
వారిధి డిగి సోఁకినపుడ వలయుం బొలియన్.

వ. అనుచు దీనమానసం బయి భయంబునం గలంగి డప్పి సొగసి యవశత నంతకంతకు డిగుచున్నయక్కాకిం గనుంగొని కలహంసం బిట్లనియె.

ఆ. నీ వనేకగతులు నేర్చితి యోగతిఁ
జనుట చెపుము వాయసంబ యేను
గడవ నరిగి పిలువఁ గా నేల తడసెద
వెఱక లేటి కిట్టు లెడల విడువ.

వ. అనియె నట్టియెడ.

క. తలకొని జలములు పత్త్రం
బులు దుండము దోఁక సోఁక బోరిఁబోరి నెగయన్

బల మఱి మెయి దిగఁబడఁగా
సొలసి యెగయ లేక వాయసుఁడు వేగడొందెన్.

వ. ఇట్లు మున్నీటినీటిపయిం బడి యగ్గలం బగునవస్థకు బెగ్గలంబు నొందుకాకంబు నాలోకించి పలుకక నగుం గాక పలికినట్లు మెవ్వరికిఁ జేయఁ దీఱఁ బని తీరెం గదా యనిన రాయంచకు నక్కాకం బి ట్లనియె.

క. ఎంగిళులు గుడిచి క్రొవ్వునఁ
బొంగినమెయుత్తోడ గర్వమునఁ దిరుగుచు నా
కుఁ గలదె యెందు నెదురు వి
హంగమపతి నైన గెలుతు నని మును దలఁతున్.

క. నాకొలఁది యిప్పు డెఱిఁగితి
నీకరుణాలోకనంబు నిగిడించి శర
ణ్యా కావు నన్ను మగుడం
గాకులలోఁ గలుపఁ దగవు గాదే నీకున్.

వ. అని యుత్తెఱంగును.

క. ఆకులతఁ బొంది పలుకుచుఁ
గా కా యని చంచు దెఱపఁగా నఱచుచు నీ
రాకరమున మునిఁగెడు న
క్కాకిం గలహంస పరమకారుణ్యమునన్.

క. వెరపునఁ దత్తనువుం దన
చరణంబుల నిఱికి యెత్తి చాఁ పుడిపి బల
స్ఫురణంబు మెఱయ వీఁపున
ధరియించుచు వచ్చెఁ బక్షితతులు నుతింపన్.

వ. ఇవ్విధంబునం దెచ్చి యెప్పటినెలవున డించి రాయంచ యక్కాకి దెప్పిఱిన దానితో నచ్చటికాకులు విన నింక నిట్టియవినయంబు

లెన్నండును జేయకు మని పలికి నిజసహచరంబు లగుమరాళంబులుం దానును వలయుచోటికిం జనియె.

---

## శరణాగతరక్షణసుకృతము.

— :o: —

### కథ.

కౌరవపాండవయుద్ధానంతరమున శరతల్పగతుం డైనభీష్ముఁడు ధర్మతనయున కీకథను (శాంతిపర్వము) జెప్పెను.

ఒకకిరాతుఁడు పక్షిధ్వంసకుఁ డై సంచరించుచు నందులకుఁ దగినసాధనముల నమర్చుకొని చిరకాలమునుండి జీవించుచుండెను. వాఁ డొకానొకదినమున నరణ్యమునకుఁ బోయి పక్షులకొఱకు వల యొగ్గి పొంత వేచియుండ సకలజంతుభీకరముగఁ బెనుగాలితో వడగండ్లవాన మోది యరణ్యమంతయు జలమయ మయ్యెను. అంత వాఁ డొకతరుమూలమున శిలాతలముపై గడగడ వడఁకుచుఁ గూర్చుండి చేయునది లేక వగచుచుండెను. అప్పుడు వాఁడు పన్నినవలలో నొకకపోతి చిక్కియుండెను. అప్పుడు మగపులుఁగు కులాయముఁ జేరి కపోతి యిలు సేరకుండుటఁ జూచి పలువిధముల విలపించెను. వలలోనున్న కపోతి భర్తయొక్క యార్తారవము విని "పతికి హిత మాచరించెడిపతివ్రతకే గా మోక్షమునకు సులభముగఁ జనువది. తనభర్తకుఁ దా ననుకూల కానియెడల నిల్లు పతి దుఃఖింపనేరఁడు" అని తాను నిష్కల్మషమైన భర్తృశుశ్రూష చేయుచుండుటంబట్టి తనకుఁ బరలోకమున నడ్డు లేనితోవ కలుగు నని మిగుల సంతసించి వలలోనుండి భర్తకుఁ దెలియునటు లీతీరునఁ గొన్నివాక్యములు పలికెను. "నీవు విలపింప వలదు. దేహములు శాశ్వతములు కావు. అల్పదేహుల మైనమనజీవన మెంత. ఇప్పక్షిధ్వంసకుఁడు శీతార్తుఁడై యిప్పట ప్రాణావశిష్టుఁడుగ నున్నాఁడు. వానికిఁ దగినసదుపాయం బొనర్చి తృప్తిపఱుపవలెను" అని భర్త నూరార్చి చెప్పఁగా నక్కపోతంబు మిక్కిలి సంతసించి యట్లొనర్చెను. పిమ్మట నబ్బోయ తన కాహారము వేఁడెను. అందుల కాపక్షి చేయునది లేక తనదేహ మాహారముగఁ గొను మని యాహారముకొఱకు శరణ మొందిన యాబోయకు నొసంగెను. అప్పుడు వాఁడు తత్తరపడి తాను జేయుతప్పిదములను దెలిసికొని యొగ్గినవలలఁ జిక్కియున్నపక్షులను వదలివేసెను. తానును బక్షితో దేహత్యాగము చేసెను.

నీతి—తమకు మిత్రుఁడైనను మిక్కిలి శత్రుఁడయినను మిగుల విపత్తు నొందెడు సమయములయందును శరణుజొచ్చు సమయములయందును స్వార్థపరిత్యాగము చేసి మిత్రామిత్ర భేదమును బాటింపక సజ్జనులు పరోపకారబుద్ధి కలిగి ప్రవర్తింతురు.

భీష్ముఁడు ధర్మజునకు శరణాగతరక్షణసుకృతం బెఱింగించుట.

క. శరణాగతసంరక్షణ
పరులకు సమకూరు నెట్టిపాటిఫలము ని
ర్భరకరుణాకర పరమా
దరమున నెఱిఁగింపు నాకు దాని తెఱంగున్.

ఆ. అనిన భీష్ముఁ డిట్టు లను ముచికుందుండు
నాఁగఁ బరఁగు ధరణినాయకుండు
దనుజమంత్రిచేత వినినది యొకకథ
యఖిలపాపహరణ మాచరించు.

వ. అయ్యితిహాసంబు సెప్పెద. దాన నీయడిగినయర్థంబు దెలియు నవహితుండ వై యాకర్ణింపుము.

సీ. పాపాత్ముఁ డొకబోయ పక్షుల వధియించి
తినియును బెక్కమ్మి కొనియు నదియ
బ్రదుకుగా దానికి బహుసాధనంబులు
సవరించుకొని మహాటవిఁ జరింప
నొకనాఁడు పెనువానయును గాలియును మొట్టి
సకలజీవులకు నాశంబు వుట్టు
నట్టిది యై కాన యంతయు జలమయం
బైన బెగ్గిలి యన్నరాధముండు

తే. వేగ వట్టోడి యెల్లను వెడలి మిఱుత
నొకవనస్పతి జొంపమై యున్నదానిఁ
జెంది రాతిరి యొరగుటయు శిలయు సెజ్జ
గాఁగ శీతార్తుఁడై యుండెఁ గౌరవేంద్ర.

క. అలుబ్ధకుఁ డత్తరువర
మాలోకించి కడు భక్తి ననిమె నిచటిభూ
తాలిం గొలిచెదఁ గరుణా
శీలతఁ నను గాచుటకు విశిష్టవినీతిన్.

వ. అని యిట్లా పక్షిధ్వంసకుండు శయనంబు పాలించి యుండ నమ్మహీరుహంబుకోటరంబున వసియించి యుండునది యొక్క కపోతంబు దనవల్లభ యెటయేని మేఁతకుంబోయి రాక తడసిన శోకించి.

సీ. ఎచట నున్నది యొక్కొ యింత ప్రొద్దాకచోట
నుండునే ననుఁబాసి యుజ్వలాంగి
యమ్మెను లేకున్న నిమ్మేనికలిమి ని
రర్థకం బనితానురాగయుక్త
యగుపతిగుణముల నైహికాముష్మిక
సుఖసాధనంబులు సువ్వె పతికి
యేకారణంబున నేమయ్యెనో వాన
యేపునఁ దిగియెఁ గానోపు నకట

తే. నేమి సేయుదు మందిరం బిపుడు పాడు
వాఱుచున్నది యనఁగ నప్పలుకు లెల్ల
బోయవలలోన నున్నకపోతి విని మ
నంబు సంతోషపూరమగ్నంబు గాఁగ.

క. పతిమదికి నింత యెక్కిన
యతివ గదా పుణ్యవతి ప్రియాలాపము లీ
గతి వినఁ గాంచితి జన్మము
కృతకృత్యం బయ్యె నాకుఁ గెలిచితి జమునిన్.

వ. అని యుల్లంబునన యుగ్గడించి పతికిం దన చెలం గెఱింగించి విధికృతంబునకు వగవం బని లే దని మఱియు నిట్లనియె.

చ. శరణము సొచ్చినం దగఁ బ్రసన్నతఁ గైకొని రక్షణంబు సా
దరముగఁ జేయు టత్యధికధర్మముగా బుధకోటి సెప్పు నీ
వరసి మహాత్తు వీని శరణాగతు నోదనభంగి నాపదం
బొరయక యుండఁ జేయుము ప్రభూతపుప్రీతుఁ గొంకు వోయెనన్.

క. అని యేర్పడ భాషించిన
విని శోకము డిగ్గవిడిచి విహగము గరుణం
దనజాతి సెప్పి తగ ని
ట్లనియె మనుజభాషణముల నాలుబ్ధకుతోన్.

క. ఓయన్న డస్సినాఁడవు
మాయింటికి నతిథి వైతి మసలక నీకుం
జేయవలయు నాతిథ్యం
జేయది భవదీప్సితార్థ మెఱిఁగింపవనా.

చ. అనవుఁడు నుల్లమొంతయుఁ బ్రియంబు వహింపఁగఁ బక్షివైరి సీ
తున సకలాంగకంబులుఁ బ్రతుప్పము లయ్యెను దీనిఁ బాపవే
యనిన విహంగమంబు రయమారఁగ నచ్చటిపుల్లలెల్ల ము
క్కునఁ గొని తెచ్చి ప్రోవిడి యకుంఠితమైన దయాగుణంబునన్,

వ. ఆప్రాంతపల్లియందు రయంబునం జని పుల్లతలసంగతం బైనయింగ
లంబు

క. కొని వచ్చి పుల్లప్రోవునఁ
దనుకంగాఁ జేసి నెమ్మి దళుకొత్తఁగ ని
ట్లను బోయతోడ మే నీ
యనలంబునఁ గాఁచికొనుట కై తెమ్మనఘా.

చ. అనవుడు వాఁడు గువ్వహృదయం బలరం దనయంగకంబు ల
య్యనలశిఖాకలాపమున నల్లన యల్లన కాచి శీతబా
ధన ముడుగంగఁ జేయఁగఁ బదంపడి యాఁకలి సాలఁ దోఁచెఁ దో
చిన నెఱిఁగించె గువ్వ కది సేయ నుపాయము లేక యాత్మలోన్.

వ. వగచి వెలవెలం బాఱి తలంచికొని వాని కిట్లనియె.

తే. ఖగములము జీవనం బనఁ గలదె సంగ్ర
హించినట్టిది యాఁకలి కేమి యైన
మాకు దొరకొన్నఁ దిండుము గాక యైన
నీవు డస్సితి వాతిథ్యనియతి వలయు.

కపోతంబు దనశరీరమును బోయ కాహారంబుగా నిచ్చుట.

వ. నాశరీరం బాహారంబుగా నిచ్చెదఁ గొనుము.

క. అని పలికి యగ్ని వలగొని
తనదేహము దానిలోన దడయక యిడినం
గని బోయ విస్మయంబున
మన మూనఁగఁ గొంతసేపు మ్రాన్పడి యుండెన్.

వ. పదంపడి.

మ. కలదే యిమ్మెయి పౌరుషంబు జగతిం గాపుణ్య మేపార ని
ప్పులఁ గిట్టిచ్చునె మేను నాదుచరితంబుల్ నిందకుం బట్టులై
తలపన్ వచ్చిన నింతకే డగునె యేతత్క్రూరతాఘోరచే
ష్టలు మానం గలవాఁడఁ బక్షిగురుఁడై సంనెంచె సద్బోధమున్.

వ. అని యంతరంగంబున వైరాగ్యంబు నిరంతరం బగుటయు సంత
నిలువక.

మ. ఇది యిట్లాలిని బంధులం దొఱఁగి తా నీయగ్నిలోఁ గూలె నా
ప్పిదమై యుండఁగ నిట్టితెంప యొలయం బెంపొందు వైరాగ్యసం
పద పాదంబుల నెల్ల దుర్గిపఁగ మహాప్రస్థానపుణ్యాత్వ మొం
దెద నే నిష్పడక్ష్యియంచు మానసము శాంతిం బొంద నిర్మోహుఁడై.

క. వలలోన నున్నపులుఁగుల
వెలువడఁగా విడిచి వలయు వెండియుఁ దనకుం
గలపక్షినిహతిసాధన
ములు నచటనె యుండఁ బోయె బోయ నియతుఁడై.

ఆ. అక్క పోతినాఁ డగ్నిలోఁ బడుటకు
శోకవహ్నిఁ జిత్త మాకులముగ
నెలుఁగు రాలుపడఁగ నిట్లని పలవించె
నశ్రుజలతరంగితాస్య యగుచు.

క. నా యాఁకలి కోర్వ నెపుడు
వే నైనను నేఁ గానంగ నోర్చి యనుభవిం
తా యాసపడుటఁ గనుఁగొని
నోయును నను బాసి యిటు సనుట దగ వగునే.

వ. అని వెండియు,

సీ. ఇగురుజొంపంబుల నింపారుపొదరిండ్లు
బలుపైనపాదల క్రేవలకుఁ దార్చి
సెలయేరులందలి తెలినీటఁ దనుపారం
పెలసిరిగినుల తెప్పలకుఁ జేర్చి
మావిమ్రోకల నెలదీవ యఁ జెన్నొందు
తోఁట కడ సరిత్తోడఁ జెంది
యలరునెత్తమ్ములకలిమిఁ జెల్వగుచిగ్గి
యలతీరభూముల నల్లఁబొంది

తే. నన్ను మనమునఁ దేల్చి యానంద మొందఁ
జేసి సలిపెడునీదగులీల మఱవ
నావశంబె ప్రాణేశ ప్రాణంబు లిపుడ
నిన్ను కూర్చి యేతెంతు నీసన్నకడకు.

వ. అట్లుంగాక,

క. జానియనుమరణమునఁ దన
మేను విడిచినట్టికాంత మేలిపదవికిం
దాను సతిండును నరిగి య
నూనస్థిరసుఖము లందుచుండుట విందుర్.

క. అని పలికి యపుడ యనలము
ఘనముగ దరికొల్పి మది విశ్వాసముఁ బొందన్
దనవల్లభుఁ దలఁచుచు వల
గొని లీలం జొచ్చి యతనిఁ గూడం జనియెన్.

క. స్ఫురితవిమానముమీఁద న
మరతతి వేష్టింప రత్నమయభూషణనుం
దరదివ్యమూర్తి వెలిఁగెడు
వరునిఁ గలసి పరమసౌఖ్యవైభవ మొసఁగన్.

తే. లీల మూఁడుకో నచ్చరలేమపిందు
బలసి యభినందనము సేయఁ బొలిచె నిట్లు
సనినపక్షియుగ్మంబువర్తనము దోఁచెఁ
బుణ్యవర్తనుఁ డగుట నాబోయ కపుడు.

వ.: తోఁచిన నతండు,

క. ఏనును నిట్లగుదు ననుచు
నూనినకౌతూహలమున నుల్లము పొదలన్
మేనెల్ల ముఖ్లలు సింపఁగఁ
గానఁ దఱిసి గళితరక్తకలితాకృతి యై

తే. అరుగుచుండువాఁ డొకచో దవానలంబు
గట్టిదిరి కాననంబెల్ల ముట్టి మండ
సంభ్రమోదితచిత్తుఁడై చక్కఁ జొచ్చి
యొడలు దొఱఁగి దేవత్వంబు వడసి యొప్పె.

ఉ. ఈయితిహాస మర్థమయి నెజ్జనముల్ వినినం బఠించినం
బాయు సుదాత్తగోహననపాతక మైనను భూరిసౌఖ్యముల్
వేయివిధంబులం బొరయు విన్మ తగన్ శరణార్థిఁ దోషితుం
జేయనినాఁడు కల్మషముఁ జెందు నొకప్పుడుఁ బాయ దేమిటన్,

# నాడీజంఘునిచరిత్రము.

## కథ.

భీష్ముఁడు ధర్మరాజునకు నాడీజంఘునిచరిత్రముఁ జెప్పెను. ఇది శాంతి పర్వమునుండి గ్రహింపఁబడినది.

తా మొరులవలన నెక్కుడుపకృతులను బడసి వారికి మితిలేనియుపకృతుల నిర్భయముగ నొనర్పవారు కృతఘ్నులు. ఇందులకుఁ దార్కాణము నాడీజంఘునికథ.

ఒక బ్రాహ్మణుఁడు తనకులాచారంబులను దొలఁగి కిరాతులం గలిసి మద్య మాంసంబుల నారగించుచు నొకకిరాతి నిల్లాలుగాఁ జేసికొని కాలముగడుపుచు దారిద్ర్యపీడితుండై ధనార్జనమునకై కొందఱుబేహారులం గలిసి వారుపోవుతోవలం బోయి వ్యవహరించుచుండెను. ఒకతరి వాణిజ్యంబున కరణ్యగాములై పోవువారితోఁ గలిసి పోవుచుండ నరణ్యమధ్యంబున మదగజం బొక్కటి గుంపుపైఁబడి జనంబుల హింసింపఁజొచ్చె. అప్పుడు భయభ్రాంతులయి బేహారులు నలుదెసలఁ బాఱఁజొచ్చిరి. అంత నప్పారుఁడు భీతచేతస్కుండై యుత్తరదిక్కున కతిదూరముగఁ బోవ నచ్చట నొకమఱ్ఱివృక్షము గాన్పించెను. మార్గాయాసమునకు డస్సి యవ్వటభూరుహచ్ఛాయను విశ్రమింప నమ్మఱ్ఱి నాడీజంఘుఁడు రాజధర్ముఁడు ననుపేళ్లంబఱఁగు నొక్కమహాబకంబునకు నివాసంబగుటచే నబ్బకపతి ధరణీసురుంగని వానివృత్తాంతమంతయు నడిగి తెలిసికొని వానినతిథిసత్కర్మని బ్రార్థించి యాబ్రాహ్మణుఁడు ధనార్థియై యుంట నెఱింగి వానితో "అయ్యా! దారిద్ర్యము వాయుటకు నాల్గుకారణములు. అందు మొదటిది మిత్రుఁడు, రెండవది రజతము, మూఁడవది కనకము, నాలుగవది బుద్ధి. వీనిలో మొదటిదగు మిత్రుఁ డెక్కుఁడనియొడు దేవగురునివాక్యంబులు కలవు గావున నీకు నేను సన్మిత్రుఁడనై యుండఁగా వలసినధనము నీకులభింపకపోదు." అని యారేయి యతిథిసత్కారం బొనర్చి వేకువ పుడమివేల్పును లేపి యతనితోఁ దనప్రియసఖుఁడు విరూపాక్షనాముఁడు మధువ్రజపురంబునకుఁ బ్రభువనియు, నాప్రోలికి మూఁడు యోజనంబుల దవ్వనియు నాప్రభువుతోఁ దా ననిపితి నని దెలుపుకొమనియుఁ జెప్పి యప్పురియుండు దెసఁ జూపియనుప నాతఁడు చని విరూపాక్షునిం గని రాజధర్మునిపనుపున ధనార్థినై వచ్చితి నని విన్నవింప విరూపాక్షుం డిట్లు వితర్కించె. "ముఖముఁ జూడ వీఁడు ఘోరపాతకుఁడని తోఁచుచున్నది. ఇతఁ డెట్టిఁడైన నేమి నాచెలి యగునాడీజంఘునిసఖ్య మీతనిఁ బవిత్రునిఁ జేయకుండునా" యని తలఁచి విప్రునకువలసినధనం బొసంగి యనిపెను. అప్పుడా దుర్బ్రాహ్మణుఁడు సంతసంబున

ధనసంచయముతో రాజధర్మునివిల్లునకుఁ జేరిన నాడీజంఘుఁడు తన ఱెక్కలచే మెల్లన వీచుచు నాతిథ్యం బాచరించి బ్రాహ్మణుఁడు నిదురించెననితలఁచి తానును నిద్రించెను.

కృతఘ్నవృత్తిగల బ్రాహ్మణుఁడు తనకు రేపటిపయనంబున కాహారంబు చింతించి నిదురించుచున్న రాజధర్మునిం బరిమార్చి మాంసంబు పొదుకఁగట్టి వెక్కసము బ్రయాణసన్నద్ధుఁడై పోవుచుండెను. అట విరూపాక్షుండు పొలవలచి రేమికీఁడు రానున్నదో యని చింతించుచుండ జాముపొద్దెక్కె. అంత నతఁడు తనమిత్త్రుఁ డెప్పటియట్ల యుదయమునఁ దనకడకు రామికిఁ జింతించుచు "దుర్బ్రాహ్మణునకు ధనమొసంగితి. ఆదుర్జనుఁడు ప్రియమిత్త్రునకేమేనియపకృతి యొనర్చెనో" యని యర్థయూటన్ బకనివాసమునకుఁ జారులఁ బంచెను. వా రట్లు చని చూచి బకము మృతి సాంగోపాంగముగాఁ దమయజమానునికి విన్నవించిరి. అతఁ డదివిని దుఃఖాకులమానసుండై యుండ పక్షులైనచారులు చూచి పోయి వెదకి యాఘాతుకబ్రాహ్మణుని బట్టితెచ్చిరి. అంతట నసురరాజు "ఆబ్రాహ్మణుని దనయెదుటికిఁ దెచ్చితి" రని కోపించి వానిని జంపి తినుండని యాజ్ఞాపింప వారును బ్రాహ్మణుండు కృతఘ్నుఁ డగుటం జేసి వాని దినుట కిష్టపడక యాబ్రాహ్మణుని కుక్కలకుఁ బెట్టిరి. కుక్కలును నాకృతఘ్నునిమాంసము ముట్టవయ్యె. కృతఘ్నునిమాంసము కుక్కలైనను ముట్టవన్నన్యాయము సార్థకమయ్యెను.

నీతి—తా నధికుఁడైన నల్పుఁడైన నితరులవలన నుపకృతి బొందకయుండ నాపత్సమయములయందు వారికి సహాయుఁడు కావలయును. అట్టితఱిఁ దనకు మిగుల నుపకృతి యొనరించిన పురుషున కుపకృతి చేయుట ధర్మము. దుర్బ్రాహ్మణునివలె నెక్కుడుపకృతిఁ బొంది మితిలేనియపకృతి చేయుట కృతఘ్నునిలక్షణము. కావున నెన్నఁడుఁగాని తాను పొందినమేలు మఱచుటయు తప్పు. మీఁదుమిక్కిలి తిరిగి తగనియపకృతి యొనరించుటంతకంటెఁ గొప్పతప్పు. సర్వదా పరోపకార మావశ్యకమనియు కృతఘ్నత మిత్త్రద్రోహము ననునివి రెండును మహాపాతకము లనియు నట్టిదుర్గుణములు గలవారెంతమిత్త్రులైనను బుద్ధిమంతులగువారు వారిని విడుచుటే కర్తవ్య మనియు నెఱింగి యారీతి నాచరింపవలెను.

భీష్ముఁడు ధర్మజునకు నాడీజంఘుని చరిత్రము చెప్పుట.

చ. వినుమొకబ్రాహ్మణుండు కులవృత్తము పెంపఱదోలంగి బోయదా
ని నొకతనాలిఁ జేసికొని నెమ్మిఁ గిరాతులఁ గూడి వేఁటకుం
జన్మఁ దినుమాంస మద్దురితసక్తుఁడు భోగపరుండు గావునన్
ధనము ఘటింపఁగాఁ దగువిధం బని చూచి వణిగ్జనంబుతోన్.

వ. చెలిమిచేసి కొందఱు గోమట్లు బేహారంబువెంట దేశాంతరంబునకుం జనఁ దానును వారితోడం గూడి పోవంబోవ గిరిగహనదుర్గమ స్థలంబున నొక్కవనగజంబు.

ఆ. పాతులోని కుటికి జనముల నున్మద
లీల నేలఁబెట్టి కాలఁ జమరఁ
జొచ్చుటయును భీతివిచ్చి నల్దిక్కులఁ
బఱచి రెల్లవారుఁ బటురయమున.

క. ఆయనయుఁ గాందిశీకుం
డై యుత్తరదిక్కు వాఱె నతిదూరముగా
నాయెడ నొకమార్గము గని
పోయెను దాను నట పోవఁబోవం గెలనన్.

తే. పొదల తఱచున జొంప మై పొదవుఁబఱపుఁ
గలిగి వట్రువఁదనమునఁ జెలువు మిగిలి
యున్నవటభూరుహామ్ముఁ గని యుల్ల మచట
నిలువఁగోరిన నామూర్తినీడఁ జేరి.

క. వనలతలకు సుమగంధము
గొని సుడివడుగాడ్పు డప్పిఁ గొండొక దేర్పం
దనుపారు నచటఁ గూర్చుం
డె నతం డట్లుండ నచ్చటికి లలితగతిన్.

వ. ఒక్కమహాబకంబు వచ్చె నది పద్మభవునకుం బ్రసాదపాత్రం బగుచు నాడీజంఘుండును రాజధర్ముండను నను పేళ్లం బరఁగు నాకొక్కరకు నమ్మఱ్ఱి నివాసం బై యుండు నప్పక్షి యట్లేతెంచి యవ్విప్రునిం గాంచి ప్రియంబు దలకొనుచూడ్కి నాదరించి,

క. ఎందుండి యేమిపనికై
యెందుల కరిగెదవు భూసురేశ్వర ప్రీతిం

బొందితి నినుఁ గని తగిమెదు
విందనైతి నాకు నీదువిధముం జెపుమా.

వ. అని యడిగిన సతం డేను మధ్యదేశీయుండ గౌతముండ నొక్క-మహనీయచరిత్రుని పుత్రుండ నాలస్యంబున వేదాధ్యయనాది విప్ర కర్మవిరహితుండనై కామలోలత్వంబున బోయత యిల్లాలుగా బోయలం గలసియుండి పేదఱికంబునకు నలసి బేహారంబు వెంట నొక్క-సాతుం గూడి పరదేశంబున కరుగుచోట గిరిగహనదుర్గమ ప్రదేశంబున.

క. వనకరి యొక్క-టి యాసా
తునకుఁ గవిసి జనచయంబుఁ ద్రుంపఁ దొడఁగుచుం
విను మెల్లవారునుం గను
కనిఁ బఱచిరి భీతి నేను గానసభూమిన్.

ఆ. పఱచి దిక్కు- దప్పి భాగ్యంబుకల్మి నీ
దైననిలయమునకు నరుగుదేరఁ
గంటి ననిన మేలుగాక నీదారిద్ర్య
మపనయింతుఁ జింత యపనయింపు.

వ. అంతకు నిమ్మాతిథ్యంబుఁ గైకొను మని రుచిమంతంబు లగుమందా కినీమీనంబులు సుపక్వంబులు సేసి మధురంబు లగువన్యఫలంబులు దెచ్చి తృప్తి యగునట్లుగా నతనికి నాహారవిధి యొనర్చి రాత్రి యగుటయుం బల్లవపుష్పసాంద్రం బగుశయనంబు గల్పించి య బ్బకపతి యద్ధరణీసురునితోడిసముచితసల్లాపంబులను సుఖనిద్రను నారాత్రి గడపి వేగుటయు నవ్విప్రు నాలోకించి.

క. విను మిత్రుండును రజతము
గనకము బుద్ధియును నాల్గు కారణములు మ
ర్త్యునిదారిద్ర్యము వాయుట
కని దేవగురుండు సెప్పె నన్నిఁటిలోనన్.

క. మిత్రుం డెక్కడు కాశ్యప
పుత్రుండ నగునేను నీకు భూసురవర స
న్మైత్రి యనుష్ఠించెద నటు
పాత్రము గాకుండుదే యపారశ్రీకిన్.

తే. నాసఖుండు విరూపాక్షనామధేయుఁ
డతనిపురము మధువ్రజ మదియు మూఁడు
యోజనము లిచ్చటికి దాని కున్న తెరువు
పట్టి వేచని యాదైత్యభర్తఁ గనుము.

క. కాంచి యతనితో నేఁ
బుత్తెంచితి నని చెప్పు మతఁ డతిప్రీతుం డై
కాంచనమును రత్నంబులు
నంచితముగాఁ జేసి యిచ్చు నప్పుడ నీకున్.

క. అని యప్పురిదెస నెప్పిన
జని యాతం డతనిఁ గాంచి సముచితభంగిన్
వినిపించె రాజధర్మున
కనుగల మాసఖుఁడ నని యు నతనిపనుపునన్.

తే. అరుగుదెంచితి ననియు ధనార్థి ననియు
నిట్లు వినిపించుటయు రాక్షసేశ్వరుండు
దేఱకొనఁ జూచి యాత్మ నిప్పాఱుఁ డధముఁ
డగుట దోఁచుచు నున్నది యడుగ వలయు.

వ. అని తలంచి.

క. కులమును విద్యయు వృత్తియుఁ
గలవా పెఱిఁగింపు మనినఁ గలఁగక తన్నుం
దెలియంగఁ జెప్పె విప్రుం
డలఘుం డగునసురపతియు నవికృతుఁ డగుచున్.

క. ఇతఁ డిట్టిఁ డైన నే మగు
నతనికి సఖుఁ డట్టి బకమహాత్మురసఖ్యం
బితనిం బాత్రముఁ జేయదె
యితనికిఁ దృప్తి యగునట్టు లిత్తు ధనంబుల్.

వ. అని నిశ్చయించి యతనికి నాహారసంఛాదనంబులు సమీచీనంబు
లుగా నిర్వర్తింపఁ దగువారి నియోగించి మఱునాఁడు కార్తికపౌర్ణ
మాసి యైన భూసురసహస్రంబులు దనగృహంబునం బసిండిపళ్ళె
రముల భోజనంబులు సేయను బహుళదక్షిణలు ప్రతిగ్రహింపనుం
గలనై మిత్రకృత్యానుష్ఠానంబులు గలిగిన నమ్మహాజనంబులలోఁ
గలపి యత్యంతాదరంబున.

క. మహనీయబహుళపూజా
సహితంబుగ భోజనంబు సంతృప్తిగ స
మ్మహితాత్ముండు నడపి దు
ర్వహభారము గాఁగఁ గనకరాశియు మఱలున్.

చ. కుడిచినపళ్ళెరంబును నకుంఠితహర్షముతోడ నిచ్చినం
గడు ముదమంది యెత్తికొని గాఢభరంబున మూర్చి మోవఁగా
మెడయును వీఁపు మూఁపులును మిక్కిలి నొవ్వనఁ గొంకుపోవ నె
క్కుడువెస నేఁగుదెంచెఁ గని కొక్కెర సమ్మద మంద మత్తికిన్.

తే. అట్లు సంతోషమునఁ దేలి యతనిఁ దప్పి
పోవ బకవల్లభుఁడు పక్షపుటయుగమున
నల్ల వీచి యాహారసమర్పణంబు
సేసి నిసి యైన సుఖనిద్ర సేయుచుండ.

నాడీజంఘుఁడు దుష్టబ్రాహ్మణునిచే మృతుం డై మరల జీవించుట.

వ. అదుర్బ్రాహ్మణుండు దన రేపటిపయనంబునకు నాహారంబు చింతించి
యిమ్మహాబకంబుశరీరంబు గ్రొవ్వి యున్నది దీనియందు మాంసంబు
సాలం గల దిది యేమఱి నిద్రపోయెడుఁ జావ నడిచి చెండికొని

పోయెదం గాక యని పాపనిశ్చయుం డై చీర సక్కం గట్టికొని
యొక్క కాష్ఠంబు కరయుగంబునం జిక్క సమర్చికొని.

క. అందంద మెడయుఁ దలయు న
మందాటోపమునఁ జెక్కుమోఁకు లడిచి చా
వుం దెలియఁ జూచి యలరెడు
డెందముతో నీక లన్నిటిని వెసనూడ్చెన్.

తే. ఊడ్చి బొందువు వ్రచ్చి పేవురివి నంజు
డంతయును బుచ్చి పాదుకగా నమరఁ గట్టి
కొనుచు వేగుఁబో కగఁటయుఁ జనియె నట్టి
సమయమున మేలు కని దనుజప్రభుండు.

క. పొలవలచె నేమిగీ డొకొ
కలిగెడు నని తలఁచి మనసు గలఁగఁగఁ దనవా
రలతోడ నుగ్గడించుచుఁ
జలియించుచు నుండఁబ్రొద్దు జా మెక్కుటయున్.

వ. రాజధర్మ్మనిం దలంచి.

ఉ. నిచ్చలు వచ్చు రేపకడ నెయ్యమెలర్పఁగ ముత్సుఖుండు నేఁ
డిచ్చటి కేల రాఁడు గుణహీనత విప్రునియందుఁ గల్మి నా
యిచ్చఁ దలంచితిం దులువ యేమి దలంచెనొ యక్కటా మదిం
బొచ్చెము లేదు నమ్ము బకపుంగవుఁ డెట్లగునొక్కొ దైవమా.

క. అని తూర వగచి యారయఁ
బనిచెం బని గలపి భటులఁ బలువుర వారుం
జని బకముడొక్క యేర్పడఁ
గని యతనికిఁ జెప్పి పుచ్చి కడువేగమునన్.

వ. అవ్విప్రునిచొప్పు పట్టి.

చ. పరిమెయిఁ బొటి వానిఁ గనిపట్టి వడిం బెడగేలు గట్టి తె
చ్చి రసురభర్త నూచి యిటు సేరఁగఁ దేవల దీక్షితఘ్నునిం

బారిగొని వే తినుం డనినఁ బోకడమాలినవార మయ్య యి
ద్దురితశరీరముం దినఁగ దోసము మా కని వార లొల్లమిన్.

వ. అతండు.

క. తినుఁడు తినకుఁ డొండేమై
నను జేయుఁడు వీని నేల నాముందటికిం
గొని వచ్చితి రని పలికిన
దనుజులు పురి వెడలఁ దెచ్చి తద్గాత్రంబుల్.

క. వెడగోఁతల నెత్తు రొలుకఁ
బడఁ ద్రోచిన వచ్చి కుక్కపదుపు వెనుకకున్
జడిసెఁ గబళింప నొల్లక
కడుపులు సకనకఁ బడంగఁ గౌరవముఖ్యా.

వ. అని చెప్పి భీష్ముండు.

క. విను మది యట్టిద కుక్కలు
దినఁగా రోయుం గృతఘ్నదేహముమాంసం
బని చెప్ప నాగమంబులు
మనుజేశ్వర తెల్ల మయ్యె మన కిచ్చోటన్.

వ. అని పలికి వెండియు ని ట్లనియె.

* * *

[నాడీజంఘుఁడు మరల జీవించుటవిడువఁబడినది.]

క. అని చెప్పి తాత యి ట్లను
మనుమనితో నాదరమున మఱియును బ్రహ్మ
ఘ్నునకును నిష్కృతి గలుగును
వినుము కృతఘ్నునకు లేదు విమలచరిత్రా.

క. ఆరయ మిత్రద్రోహము
దారుణ మగుపాతకము గృతఘ్నతకంటెన్
వైరము గొని విడువవలయు
నా రెండుదెఱఁగులవారి నాప్తుల నైనన్.

క. ఐహిత్రిం దైహికములు నా
ముష్త్రికములు నైనభద్రములు దలకొలుపున్
మిత్రధనంబులలోనను
మిత్రుఁడ యెక్కుడనుమాట నిత్తురు ప్రాజ్ఞుల్.

క. ఉత్తమకులజాఁడు సుగుణా
యుత్తుఁడు సస్నేహమతియు సగుమిత్రునకుం
జిత్తమెలర్చు తెఱంగునఁ
బొత్తుమనఁగవలయు శుభముఁ బొందవలసినన్.

వ. అని యిట్లు కృతఘ్నతయు మిత్రద్రోహంబును నధికపాతకంబులగుటయు సన్మిత్రుఁ బాటించుట శుభంబుఁ జేయుటయు భీష్ముండు భీమాగ్రజునకుం జెప్పె.

---

## భీష్ముఁడు శ్రీకృష్ణుని స్తుతించుట.

---

ఇందలి పద్యములు భాగవతము ప్రథమస్కంధమునుండి గ్రహింపఁబడినవి. కాని వానికి సందర్భించినకథ భారతశాంతిపర్వమునందలి కొంతి విధమున నున్నది.

కథ.

శరతల్పగతుండయి భీష్ముండు శ్రీకృష్ణుని స్తుతించి ధ్యానించుచు దానంతోమపరవశుఁడై యున్న శ్రీకృష్ణభగవానుల సన్నిధికి నజాతశత్రుఁడు చనుదెంచి నమస్కరించి యనన్యాయత్తచిత్తుండై ధ్యానపరాయణుండై యున్నచక్రధరుని గని తత్కారణంబు దెలియ వేడిన యుధిష్ఠిరునితో శ్రీకృష్ణుం డిట్లనియె. "పరమపవిత్రుం డగుభీష్ముఁడు శరతల్పగతుఁడై నన్ను స్తుతించుచున్నాఁడు. తత్కారణంబున నిట్లు పారవశ్యంబు నొందితి" నని నుడివె. ఆమహాత్ముఁడు సర్వధర్మజ్ఞుండు. అతఁడు దేహత్యాగంబు చేసిన ధర్మంబులు పోనగుపడును. నీ వాతనివలన సకలధర్మంబు తెలియుంగు మని ధర్మరాజును దత్సన్నిధికిం గొనిపోయెను.

నీతి—దవ్వులనుండి యైనను దన్ను వేడుకొనువారి ప్రార్థనల నాలకించి భగవంతుఁడు భక్తులయందు వాత్సల్యంబు గనఁబఱచు ననుటకును, కష్టకాలముల యందుఁ గూడ భక్తులు భగవదధీనమానసు లయి యుందు రనుటకును నీకథ తార్కాణము గాఁగలదు.

### భీష్ముఁడు శ్రీకృష్ణుని స్తుతించుట.

మ. త్రిజగన్మోహనశీలకాంతి తనువు ద్దీపింపఁ బ్రాభాతనీ
రజబంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్తముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడువన్నెకాఁడు మది నావేశించు నెల్లప్పుడున్.

మ. హయరింఖాముఖధూళిధూసరపరిన్యస్తాలకోపేతమై
రయజాతశ్రమతోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయముం బార్థున కిచ్చువేడ్క నని నాశస్త్రాహతిం జాల నొ
చ్చియుఁ బోరించుమహానుభావు మదిలోఁ జింతింతు నశ్రాంతమున్.

మ. నరుమాటల్విని నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలోఁ
బరు లీక్షింప రథంబు నిల్పి పరభూపాలావళిం జూపుచుం
బరభూపాయువు లెల్లఁ జూపులన శుంభత్కేళి వంచించు నా
పరమేశుండు వెలుంగుచుండెడు సుహృత్పద్మాసనాసీనుఁడై.

క. తనవారిఁ జంపఁ జాలక
వెనుకకుఁ బో నిచ్చగించువిజయునిశంకన్
ఘనయోగవిద్యఁ బాపిన
మునివంద్యునిపాదభక్తి మొనయు న్నాకున్.

సీ. కుప్పించియెగసినఁ గుండలంబులకాంతి
గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న
జగములవ్రేఁగున జగతి గదలఁ
జక్రంబుఁ జేపట్టి చనుదెంచురయమునఁ
బైనున్నపచ్చనిపటము జాఱ
నమ్మితి నాలావు నగుఁబాటు సేయక
మన్నింపు మని క్రీడి మరలఁ దిగువఁ

గరికి లంఘించుసింహంబుకరణి మెఱసి
నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁ గాతు
విడువు మర్జున యనుచు మద్విశిఖవృష్టిఁ
దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు.

మ. తనకు న్భృత్యుఁడు వీనిఁ గాచుట మహాధర్మంబు వొమ్మంచు న
ర్జునసారథ్యము పూని పగ్గములు చేఁ జోద్యంబు గాఁ బట్టుచున్
మునికోల న్వడిఁ బూన్చి ఘోటకముల న్మోదించి తాడించుచున్
జనుల న్మోహము నొందఁ జేయుపరమోత్సాహుం బ్రశంసించెదన్.

కం. పలుకుల నగవుల నడపుల
నలుకల నవలోకనముల నాభీరవధూ
కులముల మనముల తాలిమి
కొలుకులు వదలించుఘనునిఁ గొలిచెద మదిలోన్.

ఆ. మునులు నృపులుఁ జూడ మును ధర్మజునిసభా
మందిరమున యాగమండపమునఁ
జిత్రమహిమతోడఁ జెలువొందు జగదాది
దేవుఁ డమరు నాదుదృష్టియందు.

మ. ఒకసూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోఁచుపో
లిక నేదేవుఁడు సర్వకాలము మహాలీల న్నిజోత్పన్నజ
న్యకదంబంబులహృత్సరోరుహముల న్నానావిధానూనరూ
పకుఁడై యొప్పుచునుండు నట్టిహరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై.

వ. అని యిట్లు మనోవాగ్దర్శనంబులం బరమాత్ముం డగు కృష్ణుని హృదయంబున నిలిపికొని నిశ్వాసంబు మాని నిరుపాధికం బైన వాసుదేవబ్రహ్మంబునందుం గలసిన భీష్మునిం జూచి సర్వజనులు దివసావసానంబున విహంగంబు లారక యుండు తెఱంగున నుండిరి. దేవమానవవాదితంబు లై దుందుభివాద్యంబులు మొరసె. సాధుజనకీర్తనంబులు మెఱసె. కుసుమవర్షంబులు గురిసె.

---

# పితృవాక్యపరిపాలనము.



దశరథుండు చిరకాలము రాజ్యపరిపాలనం బొనర్చి తనకు వార్ధకము ప్రాపించుటం జేసి వసిష్ఠాదులయనుమతిని భార్యయగు కౌసల్యయందుఁ గలిగిన తన జ్యేష్ఠపుత్త్రుఁడు శ్రీరామచంద్రునకుఁ బట్టాభిషేకమహోత్సవంబు జరుపనయి యుండ మంథర యనుతనదాసిదుర్బోధంబున దశరథుని ద్వితీయభార్య యగుకైక భర్తను రామువనవాసంబు వరంబుగాఁ గోరి తన్మహోత్సవంబున కంతరాయము గల్పించె. అంత నమ్మహాయశుం డగురాముండు పితృవాక్యంబునం జేసి సీతాలక్ష్మణసహితుండై కాననంబున కేగెను.

సత్పురుషు లగుమహానుభావులు విధివిహిత మగునడవడికల నుల్లంఘింప నొల్లక తా మెట్టియిడుమల నైనను సహించి ధర్మపరిపాలన మాచరింతురు. ఇందుకుఁ దార్కాణము పరిపూర్ణయౌవనంబున సుకుమారియు సౌందర్యవతియు నగు ప్రియభార్య సీతామహాదేవిం గూడి పితృవాక్యపరిపాలనార్థము స్వార్థత్యాగియై శ్రీరామచంద్రుఁ డేకచ్ఛత్రాధిపత్య ముజ్జగించి వనవాసంబు జేయ నేగుటయె. మానవులకుఁ బితృవాక్యపరిపాలన మావశ్యకము.

అట్లు వనంబున కేగుచున్న తన్ను దారిలో సరయూనది దాటించునావికుఁడును పరమభక్తుఁడు గుహుఁడు తద్వనగమనకారణంబు దెలిసికొని దుఃఖాకులచిత్తుఁ డయి విచారింప భక్తాగ్రేసరుఁ డయిన యాతని నూరడించి రామభద్రుండు నదీతరణము గావించి యరణ్యావాసమునకుం జనియె.

ఆవార్త విని చింతాకులుం డయి భరతుఁడు తానును మునివృత్తి నుండఁ జిత్రకూటంబున నున్న యన్నను జేర నరిగిన మహానుభావుం డగురాముండు భ్రాతృప్రీతికి విస్మయ మొంది రాజ్యపరిపాలనమునకై తనపాదుక లొసంగి బుజ్జగించి తాను పదునాలుగవసంవత్సరము నంతిమదినమునఁ దప్పక యయోధ్యఁ జేరుదు నని యభయ మొసంగి పురంబున కరుగ నాజ్ఞ యొసఁగెను.

పిమ్మట భరతుండు "మీ రానతిచ్చినదినమున కయోధ్య రానిచో తద్దివసాంతమున నే నగ్నిప్రవిష్టుండ నగుదు" నని శపథము సేయ నట్లకాక యని సమ్మతించి దుష్టరాక్షసనిగ్రహం బొనర్చి శ్రీరామచంద్రమూర్తి క్రమ్మరి వచ్చుచు భరద్వాజాశ్రమంబున విం దారగించుచోఁ దా నయోధ్యఁ జేరుట కొకప్రొద్దు వ్యవధి యున్న దని జ్ఞప్తికి వచ్చి భయమంది తత్క్షణంబ తమరాక తొలుత గుహునకును ననంతరము భరతునకును మాతలకును గ్రమంబున నెఱింగింప హనుమంతుని నియోగించి పంచె.

సుహృదులు దర్శనీయుం డగు రామునిరాక వాయుపుత్త్రునివలన నెఱింగి యత్యంత సంతసము నొందిరి.

పిమ్మట రామాదులు పుష్పకాధిరూఢులై యేతేర భరతుఁడు పురజనులతోడను బ్రకృతివర్గంబుతోడను నెదురేగి సోదరులను బరమపతివ్రతామణి యగు సీతను దర్శించి పులకితుం డై వారితోడం గూడి యయోధ్యాపురప్రవేశంబు సేసి, యంతదనుక పాదుకాపరిపాలిత మగుచున్న రాజ్యంబునకు వసిష్ఠాదిమహామునుల యనుమతంబున యథావిధిగా రాముని నభిషిక్తుం గావించె.

నీతి — తా నెంతయధికుఁ డైనను పెద్దలయొక్కయాజ్ఞను శిరసావహించి యాచరించు నుత్తమపథములలోఁ బితృవాక్యపరిపాలన మావశ్యకము. శ్రీరామచంద్రమూర్తి యౌవనము, సాధుత్వము, విద్యాప్రసన్నత లోనగు సకలధర్మముల నెఱింగి తాను సౌఖ్యము నొందఁగలుగు సమయమునఁ బితృవాక్యపరిపాలనధర్మము శిరసావహించి నారచీరలు గట్టి యరణ్యంబున కరిగె. ఈధర్మాచరణమువలన నాయుర్బలము, యశోబలము, మనోబలము, గలిగి సన్మార్గవర్తి యని కీర్తిగాంచె. కాన నెట్టివారలకుఁ బితృవాక్యపరిపాలనధర్మ మావశ్యక మని పాఠకు లెఱుంగునది.

నిరపరాధుఁ డయ్యును కైకకతమున సామ్రాజ్యవైభవభ్రష్టుఁ డై వనవాసక్లేశ మనుభవింపఁ బోవు రాముని దీనస్థితియం దున్నవాఁ డని నిరాకరింపక రాజభక్తిపరాయణుఁ డై స్వశక్తి నమ్మహామహునికి సకలసపర్యలు గావించిన గుహునివలెఁ బాలకు లిక్కట్టులలో నున్నప్పుడుఁ గూడ వారి నిసుమంతయు నలక్ష్యము సేయక ప్రకృతిజను లోపినకొలఁది వారికార్యములకుఁ దోడుపడుచు వారియెడ భక్తివిశ్వాసములు గలిగి మసలవలయును.

తననిమిత్తము తల్లిచే సిద్ధపఱుపఁబడిన సకలమహీరాజ్యమును లెక్కసేయక భ్రాతృసపర్యయె యెక్కుడుకర్మ మని భరతుఁడు నిరంతరభ్రాతృసేవాతత్పరుఁ డై రామునితోఁబాటు తానును నారచీరలు ధరించి నియతుఁ డై నందిగ్రామమునఁ బదునాలుగేండ్లు కాలము గడపెను. అట్టి భరతునివలె స్వార్థపరిత్యాగము, భ్రాతృభక్తి గలిగి పాఠకులు ప్రవర్తించుట శ్రేయస్కరము.

దశరథుఁడు శ్రీరామునకుఁ బట్టాభిషేకం బొనర్ప నిశ్చయించుట.

క. మిక్కిలి భోగము లందితి
నెక్కుడు సంపదలు గంటి నెల్లగుణములన్
జక్కని కొడుకులఁ బడసితి
నిక్కంభిసిఁ బెద్దకాల మేలితి నింకన్.

క. రాజ్యభరం బఖిలగుణ
ప్రాజ్యుం డగురామునంద ప్రాపించెద సా
మ్రాజ్యపదంబున కెంతయుఁ
బూజ్యుం డతిచతురుఁ డతఁడు పుత్త్రులలోనన్.

శా. ధీరోదారుఁడు విద్విశారుఁడు జగద్వీరుండు సౌజన్య వి
స్తారుం డుత్తమశీలుఁ డర్కకులవిస్తారుండు శూరుండు గం
భీరుం డిద్ధవిచారసారుఁ డగుటన్ బెంపార విశ్వంభరా
భారం బెల్ల భరింప రాఘవు మహాభాగున్ నియోగించెదన్.

వ. అనిపలికివసిష్ఠ వామదేవాదిపురోహితులునుసుమంత్రాదిమంత్రులును సమస్తబంధురాజలోకంబును ననుమతి సేయ రామచంద్రుం బిలువం బనిచి యుచితాసనంబున నుండ నియోగించి కొండొకసేపునకు నక్కుమారు నవలోకించి,

ఉ. ఏను సమస్తదానములు నెల్లవ్రతంబులు సర్వధర్మముల్
మానుగఁ జేసి జన్నములు మానక చేసి వివస్వదన్వయాం
భోనిధిపూర్ణచంద్రుఁ డగుపుత్త్రనిధానము నిన్నుఁ గంటిఁ బెం
పూనఁగ నింక నిన్ను మహిమోన్నతిఁ బట్టము గట్ట ధన్యతన్.

మ. విను మెల్లుండి దినంబు లెస్స నిఖిలోర్వీచక్రరక్షాభరం
బున కీ వెల్లి ధరాసుతాసహితుఁ డై పుణ్యోపవాసంబు గై
కొని నేమంబున నుండు పొ మ్మనుచు వీడ్కొల్పెన్ గుణాలంకరి
ష్ణుని భూయిష్ఠవరిష్ఠనిష్ఠురరణానుష్ఠాననిష్ఠాపరున్.

*　　*　　*　　*　　*　　*

తే. దేవ యుదయాద్రి కినుఁ డేగుదెంచుచున్న
సమయ మభిషేకలగ్న మాసన్న మయ్యె
నర్హ మగుభంగి రాము రాజ్యాభిషిక్తుఁ
జేయ వలయును నటకు వేంచేయ వలయు.

క. అని విన్నపంబు సేయుట
యును నిద్దుర వోయినట్టు లూరక యుండెన్
మనుజపతి కైక యప్పుడు
జననాయకుపలుకుగాఁగ సాహసబుద్ధిన్.

క. అభిషేకోత్సవలీలా
విభవం బడరారఁ గొడుకు వేడుకతోడన్
విభుఁడు గయిసేయఁ గోరెడు
రభసంబున నీవు పోయి రఘురత్నంబున్.

మ. ఇటకుం దోకొని రమ్ము నాఁ బ్రభుఁడు సూతుం డేతెంచి విచ్చేయు మ
చ్చోటికి న్నిన్ను విభుండు రమ్మనియె నంచుం జెప్ప నాశీర్వచః
స్ఫుటనాదంబులతో సుమిత్రకొడుకున్ భూపుత్రియుం దాను నా
క్కోటఁ దేరెక్కి నృపాలఫాలముల మ్రొక్కుం గేలుదో యొప్పఁగన్.

క. పంచమహాశబ్దంబులు
దంచితగతి మొరయ జయజయధ్వను లువియం
జంచన్నానాసేనా
సంచయములు బలసి కొలువ సమ్మదలీలన్.

ఉ. మంగళపుష్పసంఘములు మౌక్తపుసేసలు నింతె పంతఁ బు
ణ్యాంగన లోలిఁ జల్ల నగ గల్లస దాయఁగ నేగుదేరఁ ద
న్వంగులు రత్నదీపకళికాళి నివాళు లొనర్పఁ జేసె ను
త్తుంగరథావరోహణము తోరణపంక్తుల నొప్పుమోసలన్.

వ. ఇట్లు రథారూఢుం డై వచ్చి రాజమందిరద్వారంబున రథంబు డిగ్గి రామచంద్రుం డుచితప్రకారంబునఁ గేకయరాజనందనగృహంబు నకుం జనుదెంచి బాష్పాకులలోచనుండును దీనాననుండు నయి యున్నతండ్రిం జూచి భీతుం డగుచు నతనికిం గైకేయికి నమస్క రించి యద్దేవి నుద్దేశించి.

క. జననీ రాజు వివర్ణా
ననుఁ జై యిట్లుండఁ గారణం బేమి యొకో
జననాయకునాజ్ఞోల్లం
ఘన మే సవినీతబుద్ధిఁ గావింపఁ గదా.

చ. అనవుడుఁ గైక రామునిభయంబు గనుంగొని నీకు నప్రియం
బని పలుకం డు దా మును రణావని నిచ్చినయావరద్వయం
బును దగ వేఁడితిన్ భరతు భూమికిఁ బట్టము గట్ట నొక్కటన్
నినుఁ బదునాలుగేఁడులు మునిస్థితిఁ గానకుఁ బుచ్చ నొక్కటన్.

క. జనకునిసత్యము నెరపెడు
తనయుఁడ వయి తేని నీవు తాపసవృత్తిన్
జను వనమున కన నగుఁ గా
కని మొగమునఁ దొంటికంటె నను వొప్పారన్.

వ. రామచంద్రుం డిట్లనియె.

చ. జననివి నీవు వేఁడు దఁట సత్యము దండ్రికి దక్కనంట నా
యనుజుఁడు నేల యేలు నఁట యక్కడ సన్మునిపాదపద్మవం
దన మఁట కృత్య మిట్లగుట ధన్యుఁడ నే గదఁ గాన కేను మీ
పనిచినయట్ల నే భరతుఁ బట్టము గట్టు సవిత్రిధాత్రికిన్.

శ్రీరాముఁడు సీతను వనంబునకుఁ దోడ్కొని పోవ నియ్యకొనుట.

ఉ. నావుడు సీత రాముని వనంబున కేగుతలం పెఱింగి ల
జ్జావనతాననంబు విరహాతిశయంబున శీతధాముధా
మావలి గప్పనంబుజమునాకృతి వెల్లఁదనంబు వొంద లో
జేవ గొనంగ లేక ధృతి చీఁలగ మానము తూలఁ దూలుచున్.

ఉ. గద్గదకంఠి యై పలుకుఁ గానకు నీవు సనంగ నేను శ
శ్వద్గుణధామ నీవెనుక వచ్చెద నిచ్చట నుండ నొల్ల న
స్మద్గమనంబు మానుచువిచారము మాను మయోధ్య రాజధా
షిద్గణసన్నిధిం గరముఁ జేడ్పడి యొంటిఁ జరింప నేర్తునే.

క. నీవు వెలి యైనభోగము
లేవియు నే నొల్ల నిన్ను నెప్పుడుఁ గొలువం
గా వలయు నాకు ననుపలు
కావిభుఁ డొకభంగి నోర్చి యాసతితోడన్.

ఉ. ఏనును నీవియోగము సహింతునె నాకిది సత్యశాసనం
బైన తెఱంగు మజ్జనకునాజ్ఞయు నక్కట నీకు నేటికిం
గాన లెఱుంగ వీవు బలుగాములుఁ బాములుఁ గ్రించుచెంచులున్
దానవమాయలుం గలపథంబులు దుర్గమభంగు లంగనా.

ఉ. నీకుఁ జరింప శక్య మగునే శరభోత్కటచండగండకా
నీకతరక్షురంకురురునిష్ఠురఫేరవదంతిదంతిభి
ద్భీకరఘోటకారిశలభిత్కిటిమర్కటపుండరీకభ
ల్లూకవృకాదిఘోరమృగలోకములోపల లోలలోచనా.

వ. అదియునుంగాక వనవాసం బతికాయాసం బభ్యాగతుల కిడి మిగిలిన కందమూలఫలంబు లాహారంబుగాఁ గొనుచుఁ బర్ణశాలల వసియిం చుచుఁ గుశతల్పంబుల శయనించుచు విషమస్థలంబులం జరియిం చుచు శీతాతపవర్షంబుల కోర్చుచు నివ్విధంబున దినంబులు గడప వలయు నీ వత్యంతసుకుమారాంగివి దురంతక్లేశంబు లనుభవింపఁ జాల విచ్చట నాయమలకుం బ్రియాచరణంబు లొనర్చుచుండుము నీవు రా వలవ దన నద్దేవి కోపించి యిట్లనియె.

ఆ. నన్ను నీకు నిచ్చి నరనాథ నాతండ్రి
సంతసించి యుండు నెంతయేనిఁ
జనునె యగ్నిసాక్షిసహధర్మచారిణి
నయిననన్ను నిలువు మనుట నీకు.

క. దనుజమృగోరగభయములు
ననుఁ జెందునె నీవు గలుగ నాథా నాకున్

నినుఁ బాసి మనుటకంటెను
మనమునఁ దలపోసి చూడ మరణం బొప్పున్.

తే. అనిన సీతరాకకు రాముఁ డనుమతించె
నపుడు సౌమిత్రి కోపరక్తాస్యుఁ డగుచు
బొమలు గీలించి విస్ఫులింగములు చెదర
నతులఖడ్గంబు నంకించి యన్నతోడ.

చ. తలఁపఁగ నీ వశక్తు నివిధంబున నాడెదు రామచంద్ర నీ
కొలఁది యెఱుంగఁ డీతఁ డతికుత్సితుఁ డై మఱిఁ దప్పి యాలిమా
టలు విని యింత తెంపున కొడంబడెఁ దా నొకసత్యవాది యై
పలుకఁడె నిన్న నేఁడు వినుఁ బట్టముఁ గట్టెద నంచు బొంకొకో.

క. నిను నభిషిక్తునిఁ జేసెద
ననుచు వసిష్ఠాదిమునులు నఖిలమహీశుల్
విన నాడె నీవరంబులు
తనయాలును దానుఁ గా కితరు లెఱుఁగుదురే.

క. మదనాతురతం బలికిన
యది సత్యం బఁట మహాసభాంతరమునఁ దా
విదితంబుగాఁగఁ బలికిన
యిది బొం కఁట దీని కింక నే మన వచ్చున్.

క. జనకుఁడు నీతిజ్ఞుం డై
పనిచినఁ బుత్రులకు నెన్నిభంగులఁ జేయం
జనుఁ గాక తగవు దప్పిన
విన నేటికి ధర్మమార్గవిరళవిధంబుల్.

క. నీకినుకకు నే వెఱతుఁ
గా కెవ్వరు గలరు దీనిఁ గా దన నాచేఁ
గేకయులును గీకయులును
గైకేయికిఁ బూనిరేనిఁ గనియెదరు బలే.

శా. అస్మత్కార్ముకముక్తబాణవిసరం బాభీలదంభోళిసం
ఘస్మేరోగ్రముగాఁగ యుష్మదభిషేకప్రాతికూల్యంబు కా
నస్మార్యం బటు గాక తక్కిన నయోధ్యాపట్టణం బంతయున్
భస్మీభూతము సేసి పుచ్చెద మహీపాలాన్వయగ్రామణీ.

వ. అనిన విని రామచంద్రుండు సౌమిత్రిం గనుంగొని నీవు నాకు భక్తుండ వగుటయు నెంత కైనం జాలుటయు నే నెఱుంగుదు మన కులాచారగౌరవంబులు నుత్తమశీలంబులును విచారించి పలుకు మేను గురువచనంబు చెల్లింపఁ గలవాఁడ నాపూనికి నిర్వహింపం జేయు నదియ నీకు సర్వకృత్యంబు నావలనిభక్తియు నట్లుం గాక.

ఆ. దశరథేశ్వరుండు తండ్రి కేకయమహీ
పాలపుత్రి తల్లి భరతుఁ డనుజుఁ
డిందులోన నితరు లెవ్వరు వీరోక్త
లేల నొడువ నుడుగుమీ తలంపు.

క. ఒరులు దల లెత్తి చూడఁగ
గరకరి మనలోన వలదు గాని మదాజ్ఞన్
భరతుకడ నుండి యతిసు
స్థిరమతి రాజ్యంబు నీవు సేయింపు మనా.

సీ. అనవుడు సౌమిత్రి యన్నమాటలు విని
మా టాడ కిట్లను మనుజనాథ
యిక్కడిభోగంబు లెవ్వియు నే నొల్ల
వనభూములను జటావల్కలములు
నెమ్మితో ధరియించి నీపాదపద్మముల్
గొలిచి వచ్చెదను నే వలవ దనిన
నొల్లఁ బ్రాణము లన్న నుడుప నేరక రాముఁ
డనుజునిరాకకు ననుమతించె.

ఆ. అపుడు దశరథుఁడు రాఘవేశ్వరుఁ
డడవి కేఁగునిశ్చయం బెఱింగి
భరితశోకజనితపరితాపదందహ్య
మానహృదయుఁ డై సుమంత్రుఁ జూచి

మ. తురగస్యందనమత్తసామజభటస్తోమంబులన్ మంత్రులన్
వరకాంతాజనులం బురప్రజల సర్వస్వమ్మునుం గొంచు నిం
క రఘూత్తంసముఁ గొల్చి నీవు సనఁగాఁ గైకేయికిన్ జెల్లదే
భరతుం బట్టము గట్టి రిత్త యగుభూభాగంబు భోగింపఁగన్.

ఆ. రాము వెనుక సకలరాజ్యసంపదలతో
నరుగు మీవు శూన్యమైనపురము
భరతుఁ డేలనిమ్ము పాపంబు సిద్ధించెఁ
గైక దీన నేమి గట్టుకొనియె.

శ్రీరామసీతాలక్ష్మణులు వల్కలవసనములు దాల్చుట.

చ. అన విని కైక కోపమున సజ్జనవల్లభుఁ జూచి మేదినీ
తనయయు లక్ష్మణుండు నయితంబుగ రాముఁడు నారచీరలేఁ
గనుఁగొనుచుండఁ గట్టుకొని కాననభూమికి సర్వశూన్యుఁ డై
చనక వరంబు లొల్లను మృషావచనుండవు గమ్ము నెమ్మదిన్.

ఆ. రఘుకులేశు లైనరాజు లెవ్వరు నాఁడి
తప్ప రొకఁడ వీవు దప్ప ననుచు
మగుడ మూర్ఛమునిఁగె మనుజేశుఁ డప్పుడు
జననిఁ జూచి రామచంద్రుఁ డనియె.

క. గురుఁడును దండ్రియు రాజును
బరికింప నితండ యితఁడు పనిచినఁ దల్లీ
గరళం బేఁ గొనియెద సా
గర మైనం జొత్తుఁ జొత్తుఁ గార్చిచ్చైనన్.

ఉ. నాకు నసాధ్యముల్ త్రిభువనంబులయందును లేవు గావునన్
వే కొనితేరఁ బంపు మునివేషము గైకొన వల్కలాను లం
చాకొమరుండు పల్కుటయు నాతనిముందటఁ బెట్టెఁబంచె న
క్కైకయు నప్డు రాముఁడు వికాసవిభాసిముఖారవిందుఁడై.

సీ. కస్తూరికాపుష్పగంధబంధురవేణి
బంధ మూడిచి జటాభార మూని
కోమలచారుదుకూలంబు లెడలించి
కర్కశవల్కాంశుకములు గట్టి
పరిలిప్తచందనపంకంబు పోఁ జేసి
నిర్మలభసితంబు నిండ నలఁది
మహనీయబహురత్నమండనంబులు ద్రుచ్చి
లీలమై నక్షమాలికలు దాల్చి.

ఆ. రాజజూటుఁ డోజ రమణీయతేజోవి
రాజమానమూర్తి రాజకీర్తి
రఘుకులాబ్ధిజనితరత్నంబు రాజన్య
చక్రవర్తి రామచంద్రుఁ డొప్పె.

వ. తదనంతరంబ జనకరాజపుత్రియు సౌమిత్రియుం దపోవేషంబులు గైకొని రప్పుడా రాజపరమేశ్వరుం డగు రాఘవేశ్వరుం డన్నరేశ్వరుం గనుంగొని

సీ. పదునాలు గేఁడులు పదునాల్గుదినములు
గాఁ బుచ్చి వచ్చెదఁ గాననమున
వర్తించు టిది యెంత వసుధేశ దీనికి
మదిలోన నీ కింత మఱుఁగ నేల
భరతుఁడు నాకంటె భక్తుఁడు గాన నీ
యాజ్ఞ దప్పక సేయు ననుమఁ బలికి
వలఁగొని తత్పాదవనజంబులకు మ్రొక్కి
కైకకుఁ బ్రణమిల్లి కడిఁది మూర్ఛఁ

ఆ. దన్ను మఱచి యున్నతండ్రి వీడ్కొని సుమి
త్రాసుతుండు జనకరాజసుతయుఁ
దోడ రాఁగ ముదముతోఁ దల్లిపాలికి
నరుగుదెంచె రాముఁ డంత నచట.

వ. కౌసల్యాదేవియుఁ బట్టాభిషేకంబునకు విఘ్నంబు గాకుండ విహిత
వ్రతోపవాసంబులు గైకొని సమస్తదేవతాప్రార్థనంబు సేయుచుఁ
బుత్రాగమనంబు విని సంతోషించి విశేషాక్షతాదిమంగళద్రవ్యం
బులు గైకొనుచు నీరాజనకరణంబులకుఁ బుణ్యాంగనలు తోడ
రా నెదురేగుదెంచి యారాజశిరోరత్నంబుఁ గనుంగొని.

క. ఉల్లము గలఁగఁగ మొగమున
వెల్లదనం బొలయఁ దాల్మి వీడంగఁ గడుం
దల్లడ మందుచు నుండఁగఁ
దల్లికిఁ బ్రణమిల్లి యతఁడు దగ నిట్లనియెన్.

ఉ. రాజు మహీశ నిచ్చినవరద్వితయంబునఁ గైక నేఁడు వి
భ్రాజితలీలమై భరతుపట్టము నే వనభూమిలోననీ
యోజఁ జతుర్దశాబ్దము లనూనతపస్స్థితి నుండ వేఁడె నీ
ట్లా జనయిత్రికోర్కియు నృపాగ్రణిసత్యము నల్పువేఁడుకన్.

క. ఏ నిట్లు తపోవేషముఁ
బూని నరేంద్రుండు వగలఁ బొగులుచు నుండం
గా నేతెంచితి నిటకును
మానసమున దీని కింక మఱుఁగకు మనినన్.

* * * *

గుహుండు సీతారామలక్ష్మణులను గంగ దాటించుట.

క. గుహుఁడను నిషాదనాథుఁడు
మహితాంబరరత్నఖచితమండనసుమన

స్వహితోపాయనములతో
విహితంబుగ రామవిభుని వేఁడుకఁ గనియెన్.

సీ. కని ప్రమొక్కి యట్లనుఁ గనుఁగొని వెఱఁగంది
యేమి యో దేవ నీ వీతపస్వి
వేషంబు ధరియించి విగతసైన్యుండవై
కానకు విచ్చేయుకారణంబు
మీబంట నేనుండ మిమ్మింత సేసిన
ద్రోహి వాఁ డెవ్వఁడు తులువ నాదు
బాణాసనార్చులపాలు కావించెద
ననిన నవ్వుచు రాముఁ డంత తెలుఁగు

తే. నోలిఁ దెలియంగఁ జెప్పి పితృోక్తవిధుల
శబరపతి యప్డు కైకకోపంబునకును
రాజునవివేకమునకు నారాఘవులకు
నయినదురవస్థకును దుఃఖితాత్ముఁ డయ్యె.

వ. అంత నమ్మహీపతియుం గిరాతపతిం బోధించి సంధ్యానియమంబులు దీర్చి నిద్రించె నాసమయంబున.

ఉ. ఆపదునాలుగేఁడులు నహర్నిశముం దననిద్ర దప్పి యారోపితచాపుఁడై రఘువరుం గొలువన్ బరమాద్భుతప్రతిజ్ఞాపరుఁడై నలక్ష్మణుఁడు జానకివిన్నఁదనంబు చిత్తసంతాపము సేయ నాశబరనాథున కద్దెసఁ జూపి వెండియున్.

వ. కౌసల్యాసుమిత్రలశోకంబుఁ జెప్పి రామధైర్యంబు గణించుచు నర్హంబగునెడ గుహుండునుం దానును గూర్చుండి పగలం బోగులు చుండె నంతఁ బ్రభాతం బేగుదెంచిన.

తే. సమయవిధులు దీర్చి సౌమిత్రిసహితవిభా
కేడువత్సరములు ధృతి గరిష్ఠ

నిష్ఠఁ దపము సేయ నేమంబు కైకొని
మనుజనాయకుఁడు సుమంత్రుఁ జూచి.

చ. అనుచిత మింక మాకు రథయానము గావునఁ దే రయోధ్యకుం
గొని చని మా తెఱంగునకు గుండెలు గ్రక్కుచునున్నయన్న రేం
ద్రునకును ముగ్గురమ్మలకు మ్రొక్కితి మే మని విన్నవింపు నీ
వనునయభంగి వారిహృదయంబుల శోకము లార్ప నేర్పునన్.

ఉ. నాపుడు గద్గదస్వరమునం బలికెన్ నను రామచంద్ర ని
న్నీవనభూమి డించి చని యేమని పౌరుల కింకఁ జెప్పుదున్
భూవిభునొద్ద కెట్లు గొనిపోవుదు శూన్యరథం బవశ్యముం
దావక సేవకుండ భవదంఘ్రులు నే నిటఁ గొల్చి వచ్చెదన్.

ఉ. ఆనతి యిమ్ము నావుడు రయంబున నీవటు వోయి వారు గం
గానది దాటి పోయి రని కైకకు నమ్మిక పుట్టఁ జెప్పినం
గాని నిజంబు సేయ దటుగాన నయోధ్యకు నేగు మన్న దీ
నాననుఁడై యతం డరిగె నారథ మెక్కి విషాద మందుచున్.

వ. తదనంతరంబ గుహుండు కర్ణధారుండుగా నావ యెక్కి సీతాసమే
తంబుగా నక్కుమారనిధానంబులు.

మ. ఘనబాహాపరిఘాభిరాములు కనత్కాండప్రచండాశుగా
సను లుత్తుంగవిశాలవక్షులు విరాజత్పంకజాక్షుల్ సుధాం
శునిభాస్యుల్ కమనీయమూర్తులు రఘుక్షోణీశు లప్పుణ్యభా
గిని భాగీరథి నుత్తరించి రకలంకీభూతచేతస్కులై.

తే. ఇత్తెఱంగున నాగంగ నుత్తరించి
గుహునిచేఁ ద్రోవఁ జూపించుకొని ప్రియమ్ము
తోడ నక్కిరాతాగ్రణి వీడుకొలిపి
యమ్మహారణ్యపథమున నరుగునపుడు.

క. హతవిధికృతి నిట్లతికఠి
నతరస్థలి నడుగు లిడుచు నడు మసియాడం

గతిపయఃపృదుపదగతి నా
క్షితిసుత డయ్యుటయుఁ జూచి చిత్తం బవియన్.

క. నడవం జాలక యడుగులు
తడఁబడఁ బుగులుచును నోరు దడుపుచు సకలా
కడుఁ దూలె ననుచు విభుఁ డెడ
నెడ నీడల నిలిచి నిలిచి యిభనిభగమనన్.

వ. అలయకుండఁ దోకొని నాఁడు మూఁడుయోజనంబులు సని సుదర్శ
నం బను సరోవరంబు గాంచి తత్తీరవటమూలంబున విడిసి మృణాళ
ఖండంబు లాహారంబుగాఁ గొని యారాత్రి యచ్చోట నుండి
మఱునాఁడు యోజనత్రియం బరిగి.

క. అమితాఘభంగరంగ
త్క్రమచంగము మృదులతుంగతరతరళతరం
గము గంగాయమునాసం
గము చేరి ప్రయాగవటము గని దాశరథుల్.

ఆ. అందు మునివరేణ్యుఁ డగుభరద్వాజుఁ డి
కాలవేది శిష్యగణసమేతు
మహితమూర్తిఁ గని నమస్కరించుటయు దీ
వించి వారిఁ గాంచి వెఱఁగు నొంది.

క. యోగసమాధి నతీతా
నాగతవృత్తాంత మరసి యాఘనులకు నా
నాగుణధనులకుఁ గరుణా
సాగరులకుఁ జేసె నతఁడు సత్కారంబుల్.

క. ఇత్తెఱఁగున నాసంయమి
సత్తముచే నుచితకృతుల సత్కృతులై భూ
పోత్తములు రాత్రి మహామో
దాత్తస్థితి నచట నిలిచి రట దివసమునన్.

మ. ఘనదుర్గం బగుచిత్రకూటనగమార్గం బాభరద్వాజుచే
విని తత్పాదసరోరుహంబులకు నావీరోత్తముల్ మ్రొక్కి వీ
డ్కొని వేడ్కం జని రప్డు రాముఁడు కనత్కోదండశుంభద్గుణ
ధ్వని మ్రోయించి మృగావళుల్ బెదర సీతం బ్రీతిఁ బొందించుచున్.

శా. ఆలోలాక్షికిఁ దద్విలోకనవినోదాసక్తి రెట్టింప ను
త్తాలాభీలవిశాలసాలవిచలద్వాతూలదూరాగ్రశా
ఖాలీలాభ్రమ లోలిఁ జూపుచు మహాకల్లోలినీరత్నమున్
గాళిందీనది దాఁటి సిద్ధవటముం గన్గొంచు నమ్మందటన్.

వ. మఱియు నానావిధంబులైనవినోదంబుల నమ్మేదినీసుతకు దుర్గ
మనపరిశ్రాంతి దోఁప కుండం జేయుచుండె.

*　　*　　*

రాముఁడు హనుమంతుని భరతునొద్దకుఁ బంపుట.

వ. రావణవధానంతరంబ అయోధ్యాగమనోన్ముఖులై యరుగు
దెంచుచు జానకీజాని పవనతనయు నవలోకించి చేరం బిలిచి నీవు
శృంగిబేరపురంబున కరిగి నాకుఁ బ్రియసఖుం డగుగుహునికి మదా
గమనంబు సెప్పి తన్ముఖవిదితపథుండవై నందిగ్రామంబున కేగి
భరతుం గాంచి తదీయేంగితమనోభావచేష్టితవచనంబు లెల్ల నెఱింగి
మద్వృత్తాంతంబులు నివేదించి రమ్మని పొమ్మనిన నతండు కామ
రూపి గావున మానుషరూపధరుండై కదలి శృంగిబేరపురంబునకు
వచ్చి యందు.

సీ. ఘనతరవ్యాయామకర్కశాకారుని
దిగ్దంతికరమహాదీర్ఘహస్తు
శైలతటాభవిశాలతరోరస్కు
మహితసమున్నతమాంసలాంగు
ననవరతకృతచాపాభ్యాసనిష్ణాతు
విఖ్యాతతనుభావవృత్తిమధ్యుఁ
గనదురుజ్యాఘాతకఠినస్ఫుటాంగుళిఁ
జటిలారిభయదోగ్రసమరదక్షు

ఆ. శీలశుద్ధసత్త్వ సేవాసమాగత
శబరసేవ్యమానుఁ జారుకీర్తి
కాంతు గుహుని నంతఁ గాంచె హనూమంతుఁ
డధికమోదనిర్భరాత్ముఁ డగుచు.

ఉ. అంతఁ బుళిందసైన్యపతు లందఱు నచ్చెరు వంద నా హనూ
మంతుఁడు చేర వచ్చి యసమానకుతూహల మొప్పఁగా మహీ
కాంతుని రాక యా శబరకాంతుని కేర్పడఁ జెప్పి వానిచే
నెంతయుఁ బూజ నొంది యట నేగె నుదగ్రమనోజవంబునన్.

వ. చని సరయువు దాటి నందిగ్రామంబు సొచ్చి

సీ. కపిలసమున్నతవిపులజటాభారు
ధృతవల్కలాజినోర్జితశరీరు
భసితత్రిపుండ్రకభాసితోజ్జ్వలఫాలు
రుద్రాక్షమాలికాభద్రమూర్తి
ననమాగ్రసంభవవ్యసనకృశీకృతు
శీలితతరుఫలమూలనిరతు
హితమంత్రిగణపురోహితయోగిమునిజన
పరివృతు నరవేషధరగిరీశు.

తే. సగ్రవిస్తృతతత్పాదుకార్చనాఢ్యు
భువనరక్షణదక్షిణబుద్ధిమహితుఁ
బరమపావనచారిత్రు భరతుఁ గాంచి
మ్రొక్కి పావని నిలుచుండె ముదముతోడ.

వ. భరతుం డతనిం గనుంగొని పూర్వపరిచయంబు లేకుండియు నాత్మీయబుద్ధిం జేసి సస్నేహంబుగ నిట్లనియె.

ఉ. ఎక్కడనుండి వచ్చితి విట కెవ్వరివాఁడ వి పెంపుఁ బోయె దీ
విక్కడి కేగుదేరఁ గత మెయ్యది తావకనామ మెద్ది నిన్

నిక్కము చూచుచుండ మది నెయ్యము పుట్టుచునున్న దెంతయున్
గ్రక్కున నీసమాగమనకారణ మంతయు నాకుఁ జెప్పుమా.

చ. అనవుడు ఫాలభాగఘటితాంజలియై కపియూథనాథుఁ డి
ట్లను రఘునాథుబంటఁ బవనాత్మజుఁడన్ హనుమంతుఁడన్ జగ
ద్ఘనుఁ డగుభూమిభర్త సను గారవ మొప్పఁగఁ బంచె నర్థితో
నినుఁ బొడగాన వచ్చితి ననిందితవర్తన నైరికర్తనా.

క. సీతాలక్ష్మణయుతుఁడై
భూతలపతి మర్గగహనభూముల భువన
ఖ్యాతిగఁ జతుర్దశాబ్దము
లాతతగతిఁ బుచ్చి వచ్చె ననఘచరిత్రా.

ఉ. ఆతతపుణ్యశీలుఁ డనపాయసమంచితసత్యపాలన
స్ఫీతుఁడు శీలవృద్ధజనసేవకుఁ డా భరతుండు భక్తివి
ఖ్యాతి మదీయపాదుకలయందుఁ గృతక్షితిభారుఁడైన వాఁ
డాతనిసేమ మారసి రయంబున రమ్మని పంప వచ్చితిన్.

మ. అనినన్ సంతస మంది కర్ణపుటపేయంబైనవాక్యామృతం
బున సౌహిత్యము నొంది యశ్రులహరీపూర్ణాక్షుఁడై కంపితాం
గనతుండై పులకించి కోర్కు లొదవంగా నుబ్బి యాలింగనం
బొనరించెన్ భరతుండు వాయుసుతుఁ జిత్తోద్యత్ప్రమోదంబుగాన్.

వ. అంత నతనికి భరతుండు గోసహస్రంబును గ్రామశతంబు నుత్తమ తురంగసహస్రంబును మత్తదంతావళసహస్రంబును మణిమయభూషణంబులును రమణీయలావణ్యలగు రమణులను ధనకోట్లనుం బసదనంబు లొసంగి యిట్లనియె.

సీ. తండ్రిపంపున ధరాతలరాజ్య మది మాని
తాపసవేషంబు దాల్చి యడవి
కరిగి చతుర్దశహాయనంబులు నెట్టు
జరపె దినంబులు జరపినట్టు

లెచ్చోటఁ నేర్క్రియ నిచ్చమై వర్తించె
నాదట నెయ్యది యాచరించె
నిప్పుడు భూమీశుఁ డెక్కడ నున్నవాఁ
డంతయు నెఱిఁగింపు మమలచరిత

తే. నమ్మనయ్యెడు నీమాట నరవరేణ్యుఁ
డరుగుదెంచుట నిక్కమే యనినఁ జారు
మందహాసితంబుతోఁ బవమానసుతుఁడు
భరతు నేర్పడ విను మని పలికె నంత.

హనుమంతుఁడు భరతునితో రామవనవాసాది వృత్తాంతంబు చెప్పుట.

చ. అనయము భూవిభుండు ముదమారఁగఁ బట్టముఁ గట్టఁ బూని మా
జననివరంబులం గరుణ సాలక రాము నరణ్యభూమికిం
జను మనినన్ జటాజినవిశంకటవల్కలముల్ ధరించి యా
జనకసుతాసుమిత్రభవసంయుతుఁడై వెస నేగె కాననన్.

సీ. అటఁ బాదచారియై యారాఘవుఁడు చిత్ర
కూటంబు సేరినఁ గోసలాధి
పతి సంస్థితుండైన భరత నీ వప్పుడు
రప్పింపఁబడి మహీరాజ్య మొల్ల
నని రాముఁ బ్రార్థింప జనపతి రాకున్నఁ
దత్పాదుకలు దాల్చి ధరణి యేలు
తలఁ పేమియును లేక తాపసవేషంబు
గైకొంటి విచ్చోటఁ బ్రకటముగ

ఆ. నీప్రసంగ మిాపు నెఱుఁగుదు పటమిాఁద
వెలఁది లక్ష్మణుండు వెనుక నరుగ
దానవోగ్రమైనదండకాటవిని వి
రాధుఁ జంపెఁ గడఁక రామవిభుఁడు.

వ. అనంతరంబ శరభంగునాశ్రమంబు సేరి తపోధనుల నారాధించి జన స్థానంబునకుం జని విచ్ఛిన్నశూర్పణఖాకర్ణనాసుండై ఖరదూషణ త్రిశిరఃప్రముఖచతుర్దశసహస్రరాక్షసులం జంపె నంత శూర్పణఖా నివేదితస్వజనవృత్తాంతుం డై పౌలస్త్యుండు మాయాదక్షుం డైన మారీచుం దోడ్తేర నద్దానవుండు మృగరూపంబు ధరించి రామాశ్ర మంబునకుఁ జనుదెంచి.

సీ. అంతంతఁ బొడసూపు నడఁగుఁ జేరువ నేగుఁ
బొద లీఁగు నిలుచును బెదరుఁ గలఁగుఁ
గదలుఁ గ్రమ్మఱి వచ్చు నెదురుగా నేతెంచు
మగిడి యుప్పరవీథి కెగయు దెసలు
సూచును దరువులు సొచ్చి లేఁజిగురులు
చవి చూపు దర్భలు చప్పరించు
మృగయూథములఁ గని మొగయుచు నల్లనఁ
గొమ్ముల సంగంబు గోకికొనుచు

తే. నున్న యట్టి మృగంబు నయ్యువిద చూచి
దీనిఁ దెమ్మన్న సజ్జగతీవిభుండు
చటులశరచాపహస్తుఁ డై చనియె నట్ల
యతని తమ్ముఁడు లక్ష్మణుఁ డరిగె నంత.

క. మునివేషంబున జానకిఁ
గొనిపోవఁగఁ బంక్తిముఖుఁడు ఘోరాకృతి యై
చనుదెంచి యజ్జటాయువు
దనుజపతిం దాఁకి కూలె దద్ఘనహేతిన్.

తే. ఆజటాయువు వర్జించి యసురవిభుఁడు
సింధునాథుని లంఘించి సీతఁ గొనుచు
లంకలోపల వనభూమి శంక లేక
యునిచె నెమ్మది దత్సతి నుత్సుకతను.

వ. అంత దాశరథులు సీత వెదకుచు వచ్చి దశాననహేతిహతపక్షీంద్ర ప్రకటితజానకీవృత్తాంతు లయి గోదావరీతటంబునఁ గ్రుమ్మరుచుం గబంధు వధియించి తన్నియోగంబున శబరిం గాంచి పంపాతీరంబున నన్ను సంభావించి ఋశ్యమూకాద్రియందు సుగ్రీవునితో బద్ధసఖ్యుం డయి వాలిం బొలియించి తత్పదంబునఁ దన్ను నునిచిన భానుసూనుండును సీత వెదకం గపులం బనుప నేనును సంపాతివచనంబున నుల్లంఘితసాగరుండ నయి లంకయందు సీతనీక్షించి రామదత్తం బైనయభిజ్ఞానం బిచ్చి యప్పురంబు దహించి హతరాక్షసుండ నయి మగిడి రామునకుఁ దద్వృత్తాంతంబు సెప్పినం గపిసేనాసమేతుం డై సముద్రతీరంబున విడిసిన.

సీ. అంత రావణు దిగనాడి విభీషణుఁ
డర్కకులాధిపు నాశ్రయించె
వానరోపేతుఁ డై వారాశి బంధించి
వీరుఁడు లంకపై విడిసి కుంభ
కర్ణాదిదైత్యులఁ గడతేర్చి రావణుఁ
దెగటార్చి జగములఁ దేజ మొసఁగ
దైత్యరాజానుజుఁ దత్పురాధిపుఁ జేసి
సరసిజగర్భాదిసురలచేతఁ

తే. దగినవరములు గొని యట దశరథేశుఁ
గాంచి ప్రణమిల్లి యగ్నిముఖంబునందు
శుద్ధ యగుసీతఁ గయికొని శుభవిమాన
మెక్కి రాక్షసవానరోపేతుఁ డగుచు.

తే. వచ్చి రఘుపుంగవుఁడు భరద్వాజపావ
నాశ్రమంబున నున్నవాఁ డనఘచరిత
యఖిలపౌరుల కానంద మతిశయిల్ల
నెల్లి నిక్కువ మిక్కడి కేగుదెంచు.

క. అనవుడు నాతనిపలుకులు
వినిమిక్కిలి సంతసిల్లి వేడుక శత్రు
ఘ్నునిఁ గాంచి పలికెనుద్గత
ఘనతరసమ్మోదబాష్పకణములు దొరఁగన్.

చ. తడయక నీవయోధ్యకు ముదంబున నేగి మహోత్సవంబు పెం
పడరఁగ జాటఁబంపుము ప్రియంబున సౌధములందు వీధులం
బడగలుఁ దోరణావళులు భాతిదలిర్పఁగ గట్టఁబంపుమీ
యెడనెడ లేక భద్రము లనేకములుర్విలసిల్లునట్లుగాన్.

ఆ. అమల మైనరాఘవాస్థానగృహమున
సింధుబంధనాదిచిత్రకథలు
వ్రాయఁబంపు దేవవసుమతీసురమంది
రములలంకరింప రమణఁబంపు

క. రాముఁడు దశముఖుఁ బోరిగొని
శ్రీమహితుండెల్లి వచ్చు సిద్ధమనుచుఁ ద
ద్భూమీశుల నిటరమ్మని
వేమనుజులఁ బంపుమా పవిత్రచరిత్రా.

వ. అనిన శత్రుఘ్నుండు సని జననీవర్గంబునకు రాఘవాగమనంబు చెప్పి యధికారిపురుషుల రప్పించి సాకేతపుర నందిగ్రామ మధ్యపథంబు సవరచేసి కస్తూరికాఘనసారమిళితచందనరసంబున నవనీతరజంబు గావించి శోభితార్థంబుగాఁ గొవిరులునెఱిపి పొడవొండయుఁ బోలయు నీకకేతనంబులు గట్టించి తత్తత్ప్రదేశంబు లలంకరింపం బంపుండని నియోగించిన యనంతరంబ.

సీ. ఘనసారచందనకలితజలంబుల
లలిమణివేదిక లలుకువారు
దారాగణోదారతారమౌక్తికముల
బెంపారముగ్గులు పెట్టువారు

వాణీమరీచులునభోమణిదీధితులగప్ప
నెలమిఁ గేతనతతులెత్తువారు
సుకుమారపిప్పలచూతపల్లవముల
గడఁగి తోరణములు గట్టువారు
తే. సౌధవాతాయనంబుల సరసమొదవ
మంచిధూపంబు లెలమి నమర్చువారుఁ
జారుమంగళధీరఘోషములు వెలయ
మించితూర్యము లొగిని వాయించువారు.
వ. అంత ననంతసేనాసహితసేనాపతి దండనాథులును నానాపురాణేతి
హాసకుశలు లగు పౌరాణికులును జతురామ్నాయచతురు లగుమహీ
సురులును ధృష్టిజయంతవిజయసిద్ధార్థధర్మపాలాశోకమంత్రపాల
సుమంత్రప్రముఖు లగుమహామాత్యులును మౌరజికవాంశికవైణికవై
ణవికగాయకనర్తకాదులగు కుశీలవులును లావణ్యసాగర సము
ద్భూతలక్ష్మీప్రతి యాతనంబు లగుశరీరంబుల నొప్పువారవిలాసిను
లును వందిమాగధులును హస్తిపకసారథి పదాతివరసహస్రంబులును
బంధుమిత్ర ధాత్రీపాల బాలవృద్ధులును జనుదేర శిబికాందోళికా
కర్ణీరథగజవరాశ్వోష్ట్రాద్యనేక యానారూఢులయిన వారలచేతం బరి
వేష్టితుండయి కౌసల్యాకైకేయీ సుమిత్రా సమేతంబుగా శత్రు
ఘ్నుండు పంచమహాశబ్దంబు లులియవచ్చి భరతునకు మ్రొక్కి నిలిచి
యున్నయ దదవసరంబున
క. ధరగదలఁ గొండ లగలఁగ
వరరథహయగజపదాతివర్గస్థితి భూ
వరులు గొలు వంగఁ గదలెను
భరతుం డానందసారభరితాత్ముండై.
క. మానుషరూపంబునఁ బవ
మానతనూజుండు దనరి మంజులకంఠా

నూనరుచి నిగుడ నిల్లను
భానుకులప్రవరుఁ డైన భరతునితోడన్.

శా. కంటేముందట మింట నూర్జితగతి క్రాంతాఖిలాశాంతమై
ఘంటాఘర్ఘరికానినాదమొదవంగా సాంద్రతేజంబు లే
వెంటం బాఱఁగఁ జారుహేమమణిదిగ్వీథీకమై వచ్చుముం
గ్రుంటింబోలునృపాలు పుష్పకము వేగక్షిప్తపక్షీశమై.

భరతుఁడు రాము నెదుర్కొనుట.

క. వనవాసపరిక్లేశం
బున నెంతయు డస్సి వల్కభూషితతనుఁడై
యనుజన్మసేవితుం డగు
జనకసుతాసహితు రామచంద్రుని గంటే.

వ. అని సుగ్రీవ జాంబవత్సుషేణులను విభీషణాదులను జూపిన నతండు పరమానందంబు నొంది యద్దివ్యవిమానంబు గనుంగొని నమస్కరించి ప్రాచీశైలోపరిభాగంబున నొప్పు పద్మబాంధవుమాడ్కి నిజప్రకాశదీప్తదిగ్వలయుం డైయున్న యారాఘవుం జేరి సాష్టాంగనమస్కృతిసేసి యగ్రజుచేత నాలింగితుం డై యతం డంకపీఠంబున నునిచి నఖాగ్రంబులఁ గపోలంబులు పుణికి యానందాశ్రుతిరోహితనయనుం డై విఘ్నీభూతతద్దర్శనుం డగుటయు మ్రొక్కి పునః పునరాలింగనంబునఁ దనరి తదనంతరంబ.

క. అకలంకుఁ డయినలక్ష్మణుఁ
డును ధరణీతనయకుం బ్రణామము సేసెం
వికచాననుఁ డై నామముఁ
బ్రకటించుచు భరతుఁ డంతఁ బ్రముదితుఁ డగుచున్.

వ. సుగ్రీవజాంబవదాదుల నాలింగనంబు సేసి వార లటమున్న నరరూపధరు లై యుండుటం జేసి మనోహరాకారు లగువారలకుశలంబడిగి నతదనంతరంబ విభీషణుం గనుంగొని.

క. దనుజాధిప నీకతమున
మనుజాధిపుఁ డని గతప్రమాదుండై యే
పున మిగిలిన దశకంఠుని
దునుమాడె నుదగ్రశత్రుదోర్వీర్యములన్.

తే. అనియె వేడుక శత్రుఘ్నుఁ డరుగుదెంచి
దశముఖాచలవజ్రిపాదముల కెరఁగి
పంబిలక్ష్మణునకుఁ బ్రణామంబుసేసి
ముదము నొందుచు సీతకు మ్రొక్కె నెలమి.

క. పతినిధనంబునఁ
హతపాదపవల్లికరణి నాత్మజ సాకా
వృత యగుకౌసల్యకు భూ
పతి సాగి నమస్కరించె భక్తిభరమునన్.

క. చన్నులమొగిఁ బాలొలుకఁగ
గన్నుల బాష్పములు దొరఁగఁగాఁ దల్లిసమా
సన్నుఁడగుకొడుకుఁ గౌఁగిట
జెన్నగు నెయ్యమునఁ జేర్చి చెలఁగెన్ భీతిన్.

ఆ. తనరఁ గేకయేంద్రతనయకు బ్రణమిల్లి
యట సుమిత్ర కెరగి యవనివిభుఁడు
అనుపమానత్తదాలింగనాది సం
భావనలఁ దనర్చె భానుకులుఁడు.

ఉ. అత్తఱి సీత యత్తలకు నందఱకుం దగ మ్రొక్కి యున్నవా
రత్తరళాక్షి నెత్తి ప్రియమారఁగ గౌఁగిటఁ జేర్చి సాధ్వి నీ
యుత్తమసచ్చరిత్రమున యుద్ధమునన్ రఘువల్లభుండు దాఁ
వత్తదుదగ్రదానవుల దర్ప మడంచె విపద్విదూరుఁడై.

వ. అంత.

క. సోదరవనితాయుతుఁడై
మోదంబున నవ్వసిష్ఠమునిపతి విలస
త్పాదముల కెరఁగి గురువిన
యాదరముల తోడ మానవాధిపుఁ డెలమిన్.

ఆ. తలఁచినపుడ నీవు తడయక రమ్మని
పూజ చేసి ధనదుపుష్పకంబు
నృపతి వీడుకొల్ప నెఱి నుత్తరమునకు
నరిగి యాకుబేరు నాశ్రయించె.

చ. దురితవిదూరుఁ డైనభరతుండు కృతాంజలి యై వసుంధరే
శ్వరుఁ డగురాముతో ననియె సప్రణయాదరభక్తి నమ్రుఁ డై
తిరముగ నేఁటిదాఁక భవదీయపదంబులయందు ధారుణీ
భరమిడి నీదురాజ్యము విభాసమునం బరికించితిం దగన్.

క. దేవర యానతి తప్పక
యీవరపాదుకలు గొలిచి యిన్నాళ్ళును సం
భావనతో నిలఁ గాచితి
నేవెంటం దప్పులేక యినసమతేజా.

చ. అని తనయిష్టదైవతములై తనరారుచునున్నపాదుకల్
గొని చనుదెంచి భక్తియెడగూడఁగ మంగళతూర్యనాదముల్
ఘనముగ మ్రోయుచుండ దశకంధరవైరిపదంబులందుఁ బెం
పునఁ బ్రమదంబుతోఁ దొడిగి భూనుతపుణ్యచరిత్రుఁ డిట్లనున్.

క. సురగజఫణినాథులచే
భరియింపఁగఁ దగినధరణిభారమ్ము దగం
గరికలభము రాజిల మును
ధరియింపఁగ నెట్టులోపు దానవభేదీ.

క. అవిరళమయభువనంబులఁ

రవి దక్కఁగ ఖద్యోతము
వివరింప సమర్థ మగునె విశ్రుతచరితా.

సీ. దివసకృత్యము లెల్ల దివసాంతమున నీదు
పాదుకలకు విన్నపంబు సేసి
కాని నిద్రింప మహీనాథ యెల్లవారు
సామ్మునకు సేమంబు సెప్పు లేద
యవధరింపుము ధాన్యధనముల్ కోశగృ
హమ్ములఁ గరిరథహయపదాతి
వర్గముల్ నీప్రభావంబున దశగుణి
తంబులై యున్నవి ధర్మవృత్తిఁ
తే. దప్పి శాసింపఁ బ్రజల నుదారవృత్తి
నున్నవారలు బాధలనొందరిలనుఁ
బ్రాకటోపనిషత్సంసిద్ధి నాకుఁ గలిగె
ననఘవృత్తిఁ గృతార్థుఁడ నయితి నేఁడు.

ఉ. కావున నీవ ధారుణికిఁ గర్తవు భర్తవు శాసకుండవుం
గావఁగఁ బ్రోవ దక్షుఁడ వఖండశాసనవైభవాదినం
భావనతోడ నీభువనభారము నెల్ల వహించి సర్వమో
దావహమైన రాజ్యముఁ బ్రియంబునఁ జేకొను మిద్ధపౌరుషా.

సీ. నేను నాకోర్కులు నివ్వటిల్లఁగ నయో
ధ్యకుఁ బోవవలయును ధరణినాథ
యీనారచీరలు నీజటాభారంబు
విడిచి యీతాపసవేష ముడిగి
మహనీయరాజార్హమంగళాలంకార
ములు దాల్చి సాంద్రప్రమోద మెసఁగి

మాన్యబాంధవమిత్రమంత్రివర్గంబుల
చిత్తాభిలాషముల్ చెలువుమిగుల

తే. గిరము గన్నులపండువుగా సమస్త
జనులు విప్రులు మునులు నుత్సాహమొంద
నేఱయు నావిన్నపమ్మును నీవు ప్రీతి
నవధరించుట యొప్పగు నవనినాథ.

వ. అనవుడు భక్తిప్రణామపూర్వకంబు లగుభరతుపలుకులకు సంతసిల్లి యంగీకరించిన శత్రుఘ్నునుపునం ప్రసాధకులు వచ్చి భరతపూర్వకంబుగా రామలక్ష్మణులజటాభారంబు లల్లన వేరువుతో విడ్చి యతిసురభితైలాభ్యంజనం బాచరించిన నిర్వర్తితోద్వర్తను లయి మంగళాభిషేకం బనుభవించి సహావర్తిసుగ్రీవాదివానరేంద్రవిభీషణాదినక్తంచరాభిషేకుత్రైదశసంహారంబ.

తే. శేషశిరోమణినిర్మలస్ఫటికపట్ట
వస్త్రములు దాల్చి హరినీలవర్ణుఁ డైన
రామచంద్రుండు విమలశారదపయోద
పరివృతాసితశైలంబుభాతిఁ దనరె.

క. నను వెన్నెలఁ దడఁబఱచెడు
ననులేపన సుమధుర సౌంది యూత్రాత్రశోభా
జనితాలంకృతి నెంతయుఁ దనరిన
తొడవులు ధరించె ధరణీపతియున్.

క. భరతుఁడు నాసౌమిత్రియుఁ
ధరణీజుఁడును దైత్యవిభుఁడుఁ దక్కినవారున్
వరభూషణాంబరాదుల
నురుతరశోభావిభూతి నొప్పిరి మిగులన్.

తే. భూధరంబునఁ దనరారు భూతపతియుఁ
బోలె నత్తఱి రాక్షసపుంగవుండు
చారుహిమధామమండలసదృశ మైన
రథ మధిష్ఠించి వెనుకను రమణఁ గదలె.

క. శత్రుంజయనామక మగు
గోత్రాచలసదృశ మైనకుంజరపతి నా
మిత్రసుతుఁ డెక్కి కదలెను
సుత్రాముఁడపోలె విభవశోభితుఁ డగుచున్.

క. అందలము లెక్కి వానర
సుందరులు ప్రియంబుతో వసుమతీసుత నా
నందముగఁ గొల్చి చనిరి పు
రందరసతిఁ గొల్చువిబుధరమణులు వోలెన్.

చ. అడవులలోనఁ గొండలఁ బ్రవాసము నాక సుఖైకలీల మై
నిడుమలఁ బొంది ధైర్యమున నెంతయు వంతల కోర్చి నేఁడు మా
కొడుకులు పుణ్యశీల యగుకోడలు నిమ్మయి వచ్చి రంచుఁ జొ
ప్పడర మహీశుభార్యలు ప్రియంబున నేగిరి హృష్టచిత్త లై.

క. కర్ణాంతాయతనేత్రి సు
వర్ణసువర్ణోజ్వలాంగి వరమణిభూషో
దీర్ణ యగుజనకనందన
కర్ణిరథ మెక్కి కదలెఁ గౌతుక మెసఁగన్.

రాముని యయోధ్యాపుర ప్రవేశము.

వ. అంతఁ బౌరులు యథోచితవాహనంబు లెక్కి పరివేష్టింప నాసన్నభృ
త్యులుం బరిచారకులు నంతంతఁ జనుదేర విజయాదిమంత్రివర్గంబు
సుగ్రీవాదివానర పరాక్రమంబులు దనవలన వినుచుం జనుదేరఁ బురో
హితవిప్రవర్గంబులు ముందటఁ జన నుభయపార్శ్వంబుల గజాశ్వ

[illegible] వాలితనయపవనతనయు లరుదేర రథాధిష్ఠితుండగువిభీష
ణుండు చరమభాగంబున నడవ నెడనెడ ననేకాశీర్వాదంబులు సేయు
విప్రజనులవాక్యంబులు నిగుడ సేతుబంధనాదిప్రసంగంబులు
సంకీర్తించువందిమాగధాదులస్తుతివచనంబులు బెరయ భేరీభాం
కారంబులుఁ బటహపటుఘోషంబులుఁ గాహళబహుళరవంబులును
దిక్కుహరస్పర్ధిఢక్కానిక్వణంబులును మృదంగమంగళరవంబు
లును శంఖవిరావంబులును డోలికాధ్వానంబులును గాంస్యముఖ
తూర్యనినాదంబులు వివిధనాళీభేదారావంబులును మత్తసింధురబృం
హితంబులును జటులఖురపుటదళితధరాతలతురగహేషితంబులును
బ్రసర్పిస్యందననేమిధ్వనులును బ్రహృష్టసుభటోద్భటకలకలంబు
లును సందర్శనాగతపురజనకోలాహలంబులును నొక్కటఁ బోరు
కలఁగర ఘనాఘనిరథాగ్రభాగంబున వృద్ధపురంధ్రీవర్గంబు ముఖవిన్య
స్తనవామ్రపల్లవాశ్వత్థకిసలయపూర్ణసువర్ణకలశహస్తలై మంగ
ళగానంబులు సేయుచు నడవ నంతంత దూర్వాక్షతకుసుమలా
జలు మీఁదఁ జల్లుచుండ బౌరకాంతలు దరుగఁ దారాగణసహితుండైన
చంద్రుండునుం బోలె విలసిల్లుచు రామచంద్రుండు నిజరాజధాని
యగు నయోధ్యానగరంబుఁ బ్రవేశించె నంత.

ఆ. అఖిలపౌరులలమి యక్కడక్కడ
సంతసంబు నొంది జలజమిత్ర
కులపవిత్రుఁ డైన కోసలేశ్వరుఁ జూడ
నరుగుదెంచి రతిరయంబుతోడ.

వ. తమలో నిట్లనిరి.

సీ. అలిమాటలకు భూపాలుండు వీరల
జేలనై యడవికి నేల పంపెఁ
దనయులతోఁ బాసి తల్లు లేక్రమమున
ల్లంబులను నోర్చి యుండిరొక్కొ

యొంటిసఁ గందెడుసంగముల్ గలసీత
యలయక వనముల మోఁగగ నెట్లు
కొడుకునకై యిట్టిగోరంబు సేసిన
యింతి సాకై కేయి యేమి గనియె

తే. విమలమంగళచరితులు వీరు లేని
పురములోపల నిలువంగ జాలు నెట్లు
మనకుఁ దొల్లింటిపుణ్యంబుమహిమ జేసి
పొలవ కెప్పటివీరలఁ జూడఁ గలిగె.

క. తనచిన్ననాఁడు తాటక
దునిమెం గౌశికు మఖంబు దొంగకి కాచెన్
మనసిజహరువిలు విఱిచెను
మునుకొని యాజామదగ్న్యముని భంగించెన్.

తే. తండ్రిపంపున నడవికిఁ దపసి యగుచుఁ
జని విరాధునిఁ దునుమాడి దనుజసమితిఁ
గూల్చి సుగ్రీవుతోఁ దగఁ గూర్మిఁ జేసి
వాసవాత్మజు సమిరాన వాలిఁ [illegible].

క. సింధుగభీరుఁడు వార్థిని
బంధించి సమగ్రకీశబలసహితుండై
సంధానుకూలముగ దశ
కంధరుఁ దెగటార్చె నిలఁ దకంపితబలుఁడై.

క. జనకునిపనుపున నడవికిఁ
జనునప్పుడు నేఁడు మగిడి చనుతతు లలరన్
జనుదెంచునపుడు నానన
వనజమురుచి యొక్కరూప వర్ణింపంగన్.

పారావారౌర్వానల
సారభుజుం డర్కజుండు చంచలనయనా.

చ. అని ముదమంది పౌరజనులందఱునుం దమలోన నిట్లు పెం
పొనరఁగ వేడ్కఁ జెప్పుకొనుచుండఁగ రాఘవుఁ డింద్రగేహమున్
దనసమపూర్ణవైభవవిడంబన మై తనరారుచుం గన
త్కనకమణీమయాదిసముదంచితరాజగృహంబు సొచ్చెనన్.

క. పరమానందామృతరస
భరితాంతఃకరణు లగుచుఁ బౌరు లమందా
దరు లై తమతమ యిండ్లకు
నరిగిరి రవివంశవల్లభాశ్రితకథులై.

వ. అంత ననంతప్రసాదసుందరుండగు రఘునందనుండు భరతశత్రు
ఘ్నులంజూచి మణికనకరమణీయంబు లగుమందిరంబులు గలిగి
యుపకంఠతస్ఫీతపల్లవితకుసుమితఫలితతరువాటికాశోభితం బగుస్థలం
బున సుగ్రీవునిం బన్నమం బగు ప్రదేశంబున విభీషణుని విడియించి
నలనీలాంగదహనుమత్సుషేణజాంబవదాదులకుం దగినవీడుపట్లు చూపి
సముచితభక్ష్యంబులు యథోచితంబుగా సమకూర్చి రం డని
పంచిన వార లట్ల చేయం దగశితమయూఖులు మనోనురూపమజ్జన
భోజనాదుల నవనీతప్రస్థానభేదు లయి సుఖం బున్నంత భరతుండు
మందస్మితచంద్రికాసముల్లసితవదనచంద్రుండై సుగ్రీవున కిట్లనియె.

ఉ. స్వీకృతపుణ్యశీలుఁడు వశీకృతసర్వనిలింపనాథుఁ డూ
రీకృతధర్మమార్గుఁ డురరీకృతనీతివిశారదుండు దూ
రీకృతదుష్టచేష్టుఁడు నరీకృతదానవవల్లభుండు మో
క్షీకృత వీరవైరి సుముఖీకృతధీరుఁడు రాఘవుం డిలన్.

క. శరణాగత వత్సలునకుఁ
గరుణామృతమానసునకు ఘనవీరతేజ

సుస్మరణాపరిణతమయునకుఁ
శరణాగతరక్షకునకుఁ జతురాత్మునకున్.

క. క్షితినాథశిఖామణికిని
జితవైరికి భక్తలోకచింతామణికిం
దతకాంతినిశామణికిని
బ్రతీతతేజోనుభావభరదినమణికిన్.

క. రాజీవదళాక్షునకును
రాజితబహుధర్మనిరతిరణదక్షునకున్
రాజితపృథువక్షునకును
రాజసదృక్షునకుఁ బత్తికి రాముని కెలిమిన్.

క. పట్టము కౌతూహలమునఁ
గట్టంగా వలయు నెల్లి కమనీయగతిన్
నెట్టన సంభారంబులు
గట్టిగ నాయిత్తము లయ్యెఁ గమలాప్తసుతా.

తే. ఘననదీశతీర్థోదకములు సథ్ధి
వారిపూరంబుఁ దెప్పింప వలయుఁగాన
వానరేంద్రులఁ బంపుము వేను గాఁగ
నుదయవేళకుఁ జనుదేర నోజ చేసి.

మ. అనినన్ సంతసమంది భానుతనయుం డత్యాదరోల్లాసియై
మన మారంగ మనోజవం బొదవ సన్మానైకసత్వాద్యధీ
నునద్రగుండగు జాంబవంతుని సుషేణున్ వేగదర్శిం గ్రమం
బున గంగాదికపుణ్యతీర్థసలిలంబుల్ దేరఁగా బంపుచున్.

వ. గవాక్షుం బూర్వసముద్రంబునకు ఋషభు దక్షిణాంబుధికి నలుం
బశ్చిమపయోధికి హనుమంతు నుత్తరపారావారంబునకు నరుగ
నియమించి వారలచేతికిం గనకకలశంబులిచ్చి పంపిన వారలతిత్వ

రితగమనంబునం దెత్తీర్థ నదీపరికలితపుణ్యసలిలంబులుం జలజ
దన్యమదకంబులుం దేరం జనిన.

శ్రీరామచంద్రపట్టాభిషేకమహోత్సవము.

ఆ. అమరలోకవిభుఁడు యముఁడును వరుణుండు
యక్షనాయకుఁడును హర్ష మెసఁగఁ
జెలఁగి రాఘవాభిషేకంబు చూడంగ
వచ్చి రఖిలవిబుధవరులతోడ.

ఆ. మంత్రసంయుతంబు మంత్రనిబద్ధమై
ఫాలమందు హేమపట్ట మమరఁ
జలజటాంశుకపిలశశిఖండుఁ డగుభర్గు
పగిది నపుడు రామభద్రుఁ డొప్పె.

క. శతమఖుఁడు సౌరభాంగీ
కృతనందనమధుపగణపరిష్కారమహో
ర్జితకనకపద్మమాలిక
యతనికిఁ బుత్తెంచెఁ బ్రీతి ననిలునిచేతన్.

ఆ. మహితనిఖిలరత్నమయ మగుహారంబు
నమరు వేడ్కతోడ నమరవిభుఁడు
ఎలమిఁ గూర్మి మిగుల నిచ్చి పుత్తెంచిన
మఱియు ననిలుఁ డొసఁగె మనుజపతికి.

ఉ. అంచితమైనకూర్మి నమరాధిపుఁ డట్లు సమీరుచేతఁ బు
త్తెంచిన రత్నహారము ధృతిన్ ఘనశీలుఁడు రాఘవుండు పా
టించి ధరించి పొందుగ ఘటించిన నుజ్జ్వలతారకాలిచే
మించినయభ్రమండలము మీఱె మనోహరదివ్యమూర్తియై.

తే. కంఠలగ్నకనకకమలమాలికచేతఁ
దనరెఁ జూడ నంత ధరణివిభుఁడు

చక్రవాకమిథునసంగతిచే నొప్పు
వరకళిందజాప్రవాహ మనఁగ,

ఆ. మహితపద్మరాగమణికిరీటము దాల్చి
యుదయదర్కమండలోదయాద్రి
యనఁగఁ బొలిచెఁ ద్రిజగదభ్యుదయస్ఫూర్తి
మూర్తియై భవప్రమోద మెసఁగ.

వ. అంత రాఘవుండు వసుమతీదేవోత్తములకు ముప్పదికోట్లసువర్ణంబులును లక్ష గుఱ్ఱంబులును సన్నియ మదగజంబులు గోటి పరిగణితంబు లగుసవత్సధేనుగణంబులును దాసదాసీజనంబులును బహువిధసస్యసమగ్రము లగుమహాగ్రహారంబులును ననేకాభరణంబులును నొసంగె నమ్మహోత్సవంబున.

క. ధర సస్యసమితిఁ బొలిచెను
దరువులు గుసుమఫలరాజిఁ దనరారెఁ దగన్
విరులు సుగంధము లయ్యెను
బరువడి నెయ్యెడల సఘనభద్రము లయ్యెన్.

క. వననిధిగంభీరుం డగు
జనపతికులశేఖరుండు సమ్మదలీలం
గనకమయపుష్పమాలిక
నినతనయున కిచ్చె నాతఁ డిచ్చం జెలఁగెన్.

సీ. కమనీయమణికనత్కనకాంగదంబులు
ముదితచిత్తునకు సంగదున కిచ్చె
సరఘమాలాకార హారినీలమాలిక
ఘనతరాత్మునకు నీలునకు నిచ్చె
మరకతమాణిక్యమహనీయదామంబు
మానుగా మారుతాత్మజున కిచ్చెఁ

బద్మరాగారుణప్రాలంబ మేపార
ననఘాత్మునకు సుషేణునకు నిచ్చె

తే. సంత వేడుక నీవు నారసక రామ
ధారుణీపతి కపులకు వేలువేల
నమలభూషణచారుదివ్యాంబరములు
గోమరు మిగులంగఁ జిత్తముకొలఁది నిచ్చె.

క. ధనదానుజుఁ డగుదైత్యుని
మనమున విస్మయము గదుర మన్ననతోడన్
మనుజపతి గిట్టనిచ్చెను
దనుజులఁ గరుణించి సముచితం బగుపూజన్.

చ. అమృతకళాంశుతుల్య మగుహారము రాముఁడు సీత కిచ్చె నా
రమణి ధరింపనొల్లక కరంబులఁ దాల్చి నిజేశుఁ జూడ భూ
రమణుఁడు నింతి కన్నెఱిఁగి రాగముతోనగుఁగాక యన్న న
క్కమలదళాక్షి వాయుజుని కంఠమునం దగిలించె వేడుకన్.

క. ఆముక్తాహారంబున
నా మారుతసూతి శారదాంబుదనిచితం
బై మెఱయుమేరుగిరిగతి
భూమవిహారమున జనులు పొగడఁగ నెగడెన్.

క. మందరధీరుఁడు రాఘవుఁ
డందఱఁ గరుణించి చూచి పాగ్రామృతని
ష్యందియగుప్రియము పలుకుచు
మందస్మితవదన మమర మఱి యిట్లనియెన్.

చ. అనయము మీకతంబునఁ బ్రమానము నొందక యొక్కమాత్రలో
వననిధిఁ గట్టి దాఁటి యనివార్యబలుండగు పంక్తికంధరుం

దనిమిత్తి నెల్లరాక్షసులఁ ద్రుంచితి మించితి నీజగంబునన్
నినిచితి గీర్తిరాజ్యపదనిష్ఠితవృత్తిఁ దనర్చితిం దగన్.

క. నీతినీతియు ధర్మంబును
మఱవక నాతోడికూర్మి మానక మర్మం
బెఱుక పడనీక మతి నే
మఱక సుఖంబంది యప్రమాదుల రగుఁడీ.

వ. అని హితోపదేశంబులు మఱియును జేసి వీరావీరాదేశంబులకు జనుండని సూలింగిసప్రేమాలాపమందస్మితకరుణాతరంగితకటాక్షవీక్షణాదుల సంభాషించి సుగ్రీవాంగదపవనసుతాదు లగుప్లవంగయూథపులను విభీషణాదిరాక్షసులను వీడ్కొలిపిన వారలు కృతప్రణాములై నిజనివాసంబులకుం జనిరి.

ఉ. విశ్రుతకీర్తియైనరఘువీరుఁడు ధర్మద మానదయాదులఁ
బ్రశ్రయధైర్యశౌర్యగణభాసురుఁడై నిరపాయవృత్తి వ
ర్ణాశ్రమపాలనంబులు ప్రయత్నముతో నొనరించుచుణ్ సమో
పాశ్రయుఁడై జగత్ప్రియముదిత్సూమతశాసన మొప్ప నేలుచున్.

సీ. ధర్మార్థకామముల్ దమలోనఁ జొంటొంటి
బెంపుఁబొంపార బాధింపనీక
పంచాంగమంత్రంబు పరిపాటిదప్పక
తగుమంత్రపక్షపాతంబు గలిగి
పరిశీపాతముఖగుణాప్రసక్తి ప్రయోగింబు
నేయుచుఁ దన్నాల శ్రీఁ దనర్చి
శక్తిసిద్ధిత్రయ సంప్రాప్తి భవ్యుఁడై
విజితారిషడ్వర్గవిభుఁడు గనుచు

ఆ. సంచితప్రవృద్ధి సప్తాంగముల మించి
చతురుపాయయుక్తి విదితి నొంది

యాతకవ్యసనములందు సంగతి లేక
యేలె ధరణి రాఘువేశ్వరుండు.

మ. నిరతిశయానుభావమును నీతియు ధర్మపదైకనిష్ఠయున్
వరగుణగౌరవంబు ననవద్యచరిత్రము సద్వివేకముం
నిరుపమబాహుశక్తియును నీతిబలంబును జూచి తమ్మునిన్
భరతుని యౌవరాజ్యమున బట్టము గట్టె నరేంద్రుఁ డిమ్ములన్.

ఉ. నీతియుఁ దాను సంగజవశీకృతుఁడై వివిధోపభోగముల్
వీతవిచారుఁడై యనుభవించుచు నుండియు నప్రమాదుఁడై
భూతలభారమంతయుఁ బ్రభూతబలంబునఁ దాల్చి సంతత
ఖ్యాతి మహోదయంబు దనరారఁగ రాఘువుఁ డొప్పె నెంతయున్.

* * * *

సంపూర్ణము.

చమత్కారము నంతయుఁ జూపి వ్రాసి మనకిచ్చినవనియెను. పింగళి సూరనామా
త్యుని కల్పనాశక్తి చూపుటకును ఆంగ్లభాషయందలి సుప్రసిద్ధనవలలను బోలిన నవలలు
కొంచెముగానైనను ఆంధ్రకవులు రచియించియుండిరని తెలుపుటకును మధురమైనను
క్లిష్టమైన కళాపూర్ణోదయమును వచనరూపముగా వ్రాయించి ఆంధ్రలోకమునకుఁ జూప
బుద్ధిపొడమినందున దీనిని వచనములో వ్రాయుటకుఁ దగిన పండితుని కొఱ కన్వేషించు
చుంటిని. కృష్ణామండలములోని తెనాలిగ్రామమందలి యున్నతపాఠశాలలో నాంధ్ర
పండితులుగానున్న బ్రహ్మశ్రీ వేదుల సూర్యనారాయణశాస్త్రిగారు 1917 సంవత్స
రము ప్రారంభమున మాకార్యస్థానమున లేఖరిగా నున్న ఆకొండి వ్యాసనారాయణ
గారి మూలమున నాకు దర్శన మిచ్చిరి. అప్పుడు నాయుద్యమమును వారితో మనవి
చేసితిని. అందుకు వారు సంతసించి నాయుద్యమమునకు తోడ్పడెద మని సెలవిచ్చి
నందున కళాపూర్ణోదయము నొకప్రతిని తెప్పించి వారి కిచ్చితిని. దానిని వారు
వచనములోనికి మార్చి 1918 సంవత్సరమున నాకిచ్చిరి. అప్పుడు వారిని
సత్కరించితిని. దీనిసర్వస్వామ్యపు (కాపీరైట్) హక్కు నాకు చెందియున్నది.
కాగితములకు కఱవుకాల మగుటచే కొలఁదిప్రతులు మాత్రమే ముద్రింపఁబడినవి. మూల
గ్రంథమున స్త్రీవర్ణనలు కొన్ని యకాలంబునకు రుచింపనివిగా నున్నవి. వాటిని

